# కాలం మాయాజాలం

(వచన కవితలు)

డా॥ జె. బాపురెడ్డి

జయం పబ్లికేషన్స్
హైదరాబాదు.

KAALAM MAAYAJAALAM
by **Dr. J. Bapu Reddy**



First Edition : 1995

Price : **Rs. 60/-**
US $ : **10**

*Published by :*
**Jayam Publications**
Plot 10, Road-5,
Jubilee Hills, Hyderabad

*inted at :*
**ola Printers (P) Ltd.**
ew Shankar Mutt, Hyderabad - 44.
Ph : 7636242

# అంకితం



ఎవరి నితాంత నిర్మల ప్రేమయే నాలో రక్తమై పారుతోందో

ఆ నా తల్లిదండ్రులు

**జంకె రామలక్ష్మి, కీర్తి శేషులు జంకె కృష్ణారెడ్డి** గారలకు

నా ఆత్మశ్రుతిగా ఈ కృతి అంకితం

★★★

రామలక్ష్మీ కృష్ణరసయోగ సిద్ధిలో
కన్ను విప్పిన జీవకణము నేను
సిరికొండ శిఖరాల శివతాండవమ్ములో
పల్లవించిన పల్లె ప్రకృతి నేను
కొండవాగుల గుడిగుడి గుంచె మాటలో
పులకలెత్తిన రామచిలుక నేను
ఇల ఉగాదులనెల్ల అలరించు చైత్రుని
జైత్రయాత్రావృతి చరిత నేను

కాలతటమున కూర్చుండి కలల అలల
తేలిపోయెడి చిరుమబ్బు బాలకుడను
పలుకనేర్పిన తల్లిదండ్రులకు, నాచి
దాత్మ వచనాలనిత్తుపూర్ణాంకితముగ!

**- జె. బాపురెడ్డి**

## బాపురెడ్డి కొన్ని ముఖ్య రచనలు

బాపురెడ్డి పద్య కావ్యాలు

బాపురెడ్డి గేయ నాటికలు

అనంత సత్యాలు

మన చేతుల్లోనే ఉంది

ప్రణవ ప్రణయం

పంచబాణ సంచా

రంగురంగుల చీకట్లు

వాడిపోని వసంతాలు

మనసులోని మాట

నాదేశం నవ్వుతూంది

శ్రీకార శిఖరం

ప్రేమారామం

**In Quest of Harmony**

**Longing For Life**

**Urn of Love**

**Loving is Living**

# ఆత్మశ్రుతి

దేశకాలాలు చిరాచిర చరాచర సృష్టిని ఆవిష్కరించే అనంత సత్యాలు - అన్నింటికీ అవి ఆద్యంతాలు -తుది మొదలు లేని ఆస్తిక నాస్తికత్వాలు - నా ఆలోచనలూ, అనుభూతులు ఈ అఖండ శక్తుల అభివ్యక్తిని నిత్యజీవిత సత్యాలకు అన్వయించే కవితాభాష్యాలు. నా రచనలన్నింటిలో దైవత్వ అనంతత్వ అద్వైత స్ఫూర్తి అంతర్లీనంగా ఉంటుంది. ఆధ్యాత్మిక భౌతిక సత్యాల సార్థక సమన్వయం సారూప్యం కనిపిస్తుంది. అందుకే నేను మానవజీవితాన్ని భిన్నత్వంలోని ఏకత్వంగానే దర్శించి విశ్లేషిస్తుంటాను. సర్వసమతాతత్వం, ఆనందోన్ముఖ చేతనత్వం నడిపిస్తుంటే రసానంద తీరాల వైపు సాగిపోయే ప్రగతి విహంగం, సృజన శతాంగం నా కవిత. మానవత్వాన్ని, దైవత్వాన్ని పరస్పర ప్రతిబింబాలుగా సంభావించే సంపూర్ణతావాది నా కవిత. మనిషికీ దేవునికీ ఒకే మాతృభాష నేర్పించే ఉపజ్ఞా కోకిల నా కవిత.

నాలుగుదశాబ్దాలుగా భావభౌతికానుభూతితో తరగలెత్తుతున్న నా కవిత మనిషి జీవితంలో ప్రణయం - ప్రణవం - సామాజిక ప్రగతి - ఈ మూడుశక్తులు పరస్పర అనుబంధాలుగా, సౌఖ్యానంద సాధనాలుగా గుర్తించింది. అవి పరిపూర్ణ జీవిత పథాన్ని నిర్దేశించే దేశకాల కరదీపికలుగా గ్రహించి పులకించింది.

సాహిత్య లోకానికి నేను అందిస్తున్న చిరుకానుక ఈ 'కాలం-మాయాజాలం' కవితా సంపుటి. మాయాజాలం అంటే ఏదో మాంత్రిక తాంత్రిక ఇంద్రజాల వ్యాపారం కాదు. సృష్టికి మూలమైన కాలం, "మార్పు"కు అధిపతియైన కాలం ప్రదర్శించే సృష్టి, స్థితి, లయ లీలా విలాసం ఈ మాయాజాలం. చేసేది తానే అయినా ఎవరెవరో చేస్తున్నట్లు భ్రాంతి కలిగించే "మాయాజాలం" నెరపుతుంది కంటికి కనిపించని కాలం.

ఇందులోని నా కవితా స్పందనలన్నీ క్రొత్త సత్యాలను ఆవిష్కరించి, క్రొత్త విశ్వాలను అందించి, క్రొత్త విలువలకు ఊపిరిపోసి తద్వారా సమతా దర్శనసత్య సుందర సమాజనిర్మాణానికి దోహదం చేసేవే. శాస్త్ర సాంకేతిక విజ్ఞానం ఎంత పెంపొందినా మానవ జీవిత పరమార్థాన్ని నిర్దేశించేవి, శివశంకర సత్య సౌందర్యాన్ని అందించేవి సాహిత్యకళా చేతనాలేనని ప్రకటించేవే.

ఇందులో అరవై కవిత లున్నాయి. వాటిలోని వస్తు వైవిధ్యం నేను జీవితాన్ని వివిధ దృక్కోణాలనుంచి గమనిస్తూ పొందిన స్పందనలకు ప్రతిరూపం. వస్తుగత భావావేశం ఆయా కవితలలోని రూప నిర్మాణానికి దోహదం చేసింది.అయితే ఈ కవితలన్నింటిలో ఆత్మీయతతో నిండిన అభ్యుదయ మానవతా దృక్పథం అంతస్సూత్రంగా అల్లుకొని ఉంది.

ఈ సందర్భంలో నన్ను ప్రేమిస్తూ, అభిమానిస్తూ, ప్రోత్సహిస్తూ ఆదరిస్తున్న అసంఖ్యాక స్నేహశీలురకు, ప్రతిభాశాలురకు ప్రగతి కాముకులకు సాహితీ బంధువులందరికీ నా అక్షరాభివందనలు, కృతజ్ఞతా పూర్వక భావసుమమాలలు అందిస్తున్నాను.

నా భావచేతనకు బీజం పోసిన నా తల్లిదండ్రులకు ఈ కృతిని నా ఆత్మశ్రుతిగా అంకితం చేస్తున్నాను. అజాతశత్రువుగా ఆబాలగోపాలం కీర్తించిన నా తండ్రి కీర్తికాయుడు శ్రీజంకె కృష్ణారెడ్డిని, చదువుకోని సరస్వతిగా, సంస్కారానికి ద్యుతిగా నూరు వసంతాలకు చేరువౌతున్న నా తల్లి శ్రీమతి రామలక్ష్మిని రసానందాశ్రువులతో అభిషేకించగలుగుతున్నందుకు నేను ధన్యుణ్ణి.

నాకు సర్వదా తోడునీడగా నిలిచి నన్ను ప్రోత్సహించే సహధర్మచారిణి శ్రీమతి రాజేశ్వరికి ఆశీఃపురస్సర శుభాకాంక్షలు.

నాపట్ల ఎనలేని ప్రేమతో ఈ గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా ప్రచురిస్తున్న "జయం పబ్లికేషన్స్" వారికి, ముఖ్యంగా శ్రీ జె. మారుతి గారికి నా ప్రశంసాపూర్వక ధన్యవాదాలు. పుస్తకాన్ని ముద్దుగా ముస్తాబుచేసిన విష్ణ ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారికి, ప్రత్యేకంగా శ్రీ ఎం.విజయసేనారెడ్డి గారికి నా హార్దిక శుభాకాంక్షలు-ధన్యవాదాలు.

**- బాపురెడ్డి**

# ఈ సంపుటిలో...


| | |
|---|---|
| కాలం మాయాజాలం | 1 |
| కాలాన్ని పట్టుక వేలాడుతున్నా | 3 |
| ఆత్మబంధువు | 5 |
| నా కవితల కవిత | 7 |
| అభిమన్యుడు | 9 |
| భయం | 11 |
| తప్పెవరిది | 13 |
| ప్రణవయానం | 15 |
| మరపు - వెరపు | 17 |
| పుస్తకం నుంచి వాస్తవంలోకి | 20 |
| అల్లరి నీటి అలలు | 22 |
| ప్రగతి ప్రదర్శనం | 24 |
| నిషిద్ధ కవిత | 28 |
| రామానుజరావు | 31 |
| సంస్కరణ భావవసంతం | 33 |
| భ్రమ - ప్రమ | 36 |
| మనమతం మానవతం | 38 |
| జన్మదినం | 40 |
| ఋతుచక్రధారలు | 42 |
| చీకటి సేవలో వెలుతురు | 44 |
| తెలుగు నుడికారాలు | 48 |
| పట్టుబడని గుట్టు | 50 |
| కాశిలో కవితాభిషేకం | 52 |
| ఏ రుద్రుడో ఈ ఆరుద్రుడు | 55 |
| సత్యానికి హత్యాగండం | 57 |
| ఆత్మజ్ఞాన గోవిందుడు | 62 |
| హర్యామరసవృక్షం | 65 |
| శత్రుభయం | 67 |
| క్షరాక్షర రాక్షసి | 69 |

| | |
|---|---|
| నీతిలేని రతి | 71 |
| అరుణోదయం | 76 |
| మృత్యుంజయులు | 77 |
| రాజకీయ పంచాంగం | 79 |
| అనంత క్షణం | 81 |
| సెలవు తీసుకోని శిశిరం | 83 |
| సారోపనిషత్ | 85 |
| కాలాన్ని కన్నతల్లి | 87 |
| సత్యహేల | 88 |
| తిమిరావళి | 90 |
| కుకవీశ్వరుడు | 92 |
| కోహం అనలేని అహం | 94 |
| తారుమారు | 96 |
| కొత్త పల్లవి పల్లవాలు | 98 |
| గ్రంథాలయ గోపురాలు | 100 |
| కారణ జన్ముడు సంజీవయ్య | 102 |
| గగనాంగనాంగుళీయం | 105 |
| కాలం పట్టిన కరదీపం రంగా | 107 |
| స్వార్థతంత్ర దేశం | 109 |
| ప్రాశ్నికవాది ఈ ఉగాది | 112 |
| మారని మత్సరం | 115 |
| అనంతం అజ్ఞానం | 117 |
| లైంగికాభినయం | 118 |
| ప్రమాదంలో ప్రగతిచక్రం | 120 |
| ఆత్మజ్ఞానం | 123 |
| సత్యమంత్రం | 125 |
| విప్లవ కోకిల | 127 |
| ఉపజ్ఞా కోకిల | 129 |
| అవర్ణనీయం | 130 |
| కాలపత్ర లిపి | 131 |
| స్త్రీ వేదం | 133 |

# కాలం మాయాజాలం

కాలాన్ని జీవితం చేస్తే
చితికి పోతున్నది
మృత్యువు చేస్తే బ్రతికిపోతున్నది
మట్టిని చెట్టు చేస్తుంది కాలం
చెట్టును మట్టి చేస్తుంది కాలం
శూన్యంలో నుంచి అన్నీ సృష్టిస్తుంది
శూన్యంలోకి అన్నిటినీ నెట్టేస్తుంది
గ్రహాలనూ నక్షత్రాలనూ
నిశ్శబ్ద సూత్రాలతో
నింగిలో వ్రేలాడేస్తుంది
కాలం
అందరితో దోస్తీ చేస్తుంది
అందరితో కుస్తీ పడుతుంది
కాలానికి కళ్లు లేవు
కాని నిరాకార రూపాన్నికూడా కంటుంది
కాలానికి చెవులు లేవు
కాని అది
నీరవ రావాలనుకూడా వింటుంది
కదలని మెదలని కాలం

అన్నిటినీ కదిలిస్తుంది
మార్పులు చేర్పులు లేనికాలం
అన్నిటినీ మార్చేస్తుంది
ఇన్ని గారడీలు చేస్తున్న కాలం
అన్ని రహస్యాలు చెపుతుంది
తన రహస్యం తప్ప
అన్నిటిమీద అధికారం ఇస్తుంది
జనన మరణాలమీద తప్ప
అన్ని హక్కులు ప్రసాదిస్తుంది
తనను ఎదిరించే హక్కు తప్ప

# కాలాన్ని పట్టుక వ్రేలాడుతున్నా!

పుట్టినప్పటినుంచీ, నేను
కాలాన్ని పట్టుక వ్రేలాడుతున్నాను
వెలుగునుండి చీకటిలోకి
చీకటినుండి వెలుగులోకి
నిర్విరామంగా ఊగుతున్నాను
పెండ్యూలంలా -
కాలమే నా పథం
కాలమే నా రథం
కాలమే నా గమనం - గమ్యం
కాలాన్ని వదలి ఎటూ కదలలేని
భోలా శిశువును నేను
కాలం కడుపులో పుట్టి
కాలం ఇంటిలో మెట్టి
కాలం ముంగటిలోనే గిట్టే
లీలాబిందువును నేను
భోలా శిశువును నేను -
నేనే కాదు
నవగ్రహాలు, నక్షత్రాలు
లెక్కలేని బ్రహ్మాండాలు

దిక్కు దిక్కున తిరుగుతున్నాయి

కాలం గీసిన వృత్తాలలో-

నింగి వ్రేలాడుతూంది

నిశ్శబ్దం వ్రేలాడుతూంది

చెట్టులాంటి కాలాన్ని పట్టుకొని

గుట్టు తెలియని కాలాన్ని

గుర్తుపెట్టుకొని.

# ఆత్మబంధువు

గతం, ఆగతం లేని
వర్తమానం కాలం
చీకటీ వెలుతురూ లేని
శ్రీకారం కాలం
క్షణాలు, దినాలు
వారాలు, మాసాలు
అబ్దాలు, శతాబ్దాలు
తరాలు, యుగాలు
కొలవజాలని జీవశిఖరం కాలం
తెలియజాలని భావకుహరం కాలం
అంతటా తిష్ఠవేసిన కాలానికి
అడ్రసు మాత్రం లేదు
చరిత్రలన్నీ సృష్టించే కాలానికి
ఓ చరిత్రంటూ లేదు
కాలం చూపునుంచి
తప్పుకోగలిగే కణం లేదు.
కాలం తీర్పును మార్చగలిగే శాసనం లేదు
బ్రతికినా చచ్చినా విడిపోని
బాంధవి కాలం

మనం ఎక్కడికి పోయినా
ఏమి చేస్తున్నా
వెంట ఉండే వాస్తవం కాలం -
ప్రేమించినా ద్వేషించినా
నమ్మినా నమ్మకపోయినా
పట్టించుకోని పసిపాప కాలం
పక్షపాతంలేని సాక్షీభూతం కాలం
ఏ లిపికీ, లేఖినికీ అందని అక్షరమాల కాలం
జడానికీ చేతనకూ, ఆబాలగోపాలానికీ
ఆత్మబంధువు కాలం

# నా కవితల కవిత

నా కవితలు
నవ్వుతాయి - ఏడుస్తాయి
మౌనంగా అభినయిస్తాయి
పర్జన్యంలా గర్జిస్తాయి
దిక్చక్రతీరాలలో, దూరదూరాలలో
నిశ్వాస నిగూఢాంతరాళాలలో
కొండల్లో కోనల్లో
సమతాగాన ప్రవంతుల్లో
విస్పష్టంగా వినిపిస్తాయి
విచ్చలవిడిగా విహరిస్తాయి
ఏదో శోధించాలనీ, బోధించాలనీ
ఆరాటం
అజ్ఞానంతో పోరాటం
విజ్ఞానంతో చెలగాటం
ఎండిపోయిన ఎడారుల్లో
గుడారాలు వేసుకుంటాయి
మాడిపోతున్న మట్టిలో
మధురస్వప్నాలు కంటాయి
ప్రశ్నలు వేసుకుంటాయి

సమాధానాలు వ్రాసుకుంటాయి
కళ్లులేని కాలానికి
దారి చూపిస్తాయి
ధైర్యం కలిగిస్తాయి

నా కవితలు
ఆకలిలేని పికాలు
నిదురపోని శుకాలు
రాలిపోని లతాంతాలు
వాడిపోని వసంతాలు.

# అభిమన్యుడు

విద్వేష విషోహాలు పన్నిన
పద్మవ్యూహంలో చిక్కుకున్న
ఆవేశాల అభిమన్యుణ్ణి నేను
ధర్మంకోసం కురుక్షేత్రంలో
ధైర్యంగా నిలిచాను
హక్కుల కోసం శత్రువులతో
ఒంటరిగా పోరాడాను
కన్నతండ్రి తోడులేకున్నా
కన్నయ్య నీడలేకున్నా
సాహసించి ఎదిరించాను
మోహరించిన మోసాలను
నా జీవిత కర్మక్షేత్రాన్ని
దుర్మార్గ దుర్యోధన దుష్టశాసనం
నాశనం చేసింది
ధర్మాచార్యులను విచిత్రవీర్యులను
దానవత్వం లొంగదీసింది -
గుప్పించి చొచ్చుకపోవటం తప్ప

తప్పించుక బయటపడడం తెలియని
బాలాభిమన్యుణ్ణి నేను
తల్లికడుపులోనే వ్రాయబడ్డ
తలవ్రాతను తప్పించుకోలేని
కాలోపహతుణ్ణి నేను

# భయం

ఉన్నది ఊడుతుందేమోనన్న భయం
లేనిది దొరకదేమోనన్న భయం
నాకన్న చిన్నవాళ్లు
నన్ను మించిపోతారేమోనన్న భయం
నా కన్న ముందున్నవాళ్లను
నే నందుకోలేనేమో అన్న భయం
మేఘాలు గర్జిస్తే
పిడుగులు పడతాయన్న భయం
వర్షాలు కురుస్తుంటే
వరదలొస్తాయన్న భయం
గిరగిరా తిరిగే భూగోళం
గబుక్కున కూలిపోతుందని భయం -
ఆరోగ్యం చెడుతుందేమోనన్న భయం
యాక్సిడెంటు జరుగుతుందేమో అని భయం
మిత్రులు శత్రువులవుతారనే భయం
యుద్ధ భయం - ఓటమి భయం
బాంబుల భయం - కిడ్నాపుల భయం
ప్రేమిస్తే భయం - పెళ్లంటే భయం

త్యాగం చేయాలంటే భయం
భోగం అనుభవించాలంటే భయం
వేదికలెక్కితే కొడతారని భయం
సత్యం చెపితే తిడతారని భయం
కీర్తి వస్తే అపకీర్తి భయం
మధ్య మధ్య మృత్యు భయం
ఇక ఈ బ్రతుకులో
భయాన్ని జయించే దెట్లా?
ఆనందం అనుభవించే దెట్లా?

# తప్పెవరిది ?

నేను విషసర్పాలను ద్వేషించను
వాటి నోటికి విషపుకోరలు తగిలించిన
విధిని నిందిస్తాను
కాని దురాశా విషదంష్ట్రలు పెంచుకొని
తోటి మానవుల్ని కాటు వేస్తున్న
స్వార్థపరుల్ని ఈసడిస్తున్నాను -
నేను క్రూరమృగాలను దూషించను
వాటికి అన్నంపెట్టక ఆకలిపెట్టి
దిక్కులేని అడవిలోకి నెట్టిన
దైవాన్ని నిందిస్తాను
కాని,
కోటికి పడగలెత్తినా
కూటికి లేనివారిని కాల్చుకుతినే
మానవ మృగాలను శపిస్తున్నాను -
నేను తిరుగబడే తమ్ముళ్లపై కోపించను
వారిని పీడించే వ్యవస్థను నిరసిస్తాను
కాని,

చదువుకున్న మేధావులు నిర్మిస్తున్న
దుష్ట నికృష్ట దుర్నీతి దుర్గాలను భేదిస్తున్నాను -
నేను జననానికిముందు
మరణానికి వెనక ఉన్న
మర్మాలను శోధించను
కాని,
అనుభవించమని ఆహ్వానించే జీవితాన్ని
అర్థంలేని మిథ్య అనే
మెట్ట వేదాంతుల వెలివేస్తున్నాను

# ప్రణవయానం

అరుకులోయ చేరే
అరణ్య రైలుమార్గంలా
దుర్గమమైన అజ్ఞానపు కొండల్ని
చీల్చుకుంటూ
ఆనంద సీమలు చేరుకుంటున్న
వలపు జంటలం మనం -

మిట్టపల్లాలను
ఒడుదొడుకులను
మన సమైక్యతాశక్తితో ఎదిరించి
స్వర్గసౌఖ్యానుభూతిని
స్వాధీనం చేసుకుంటున్న
సాధకులం మనం

కాలం తొలిచిన బొర్రా గుహల్లో
మనం చేసిన శివలింగాభిషేకం
గోస్తనీ నదియై
మంటలు రేగిన బీడు భూముల్లో
పైరు పంటలు పండిస్తున్నది -

నా కేశాటవిలో సంచరించే
నీ కిసలయాంగుళులు
నా శిశిరఘాత చైతన్యాన్ని
వసంతీకరిస్తున్నవి -

నా అడుగులో వేసే నీ అడుగులు
అనంతగిరి శిఖరాలందుకుంటున్నవి
నా చేయిని కీలించిన నీ చేయి
సుందర స్వప్నాలను లాలిస్తున్నది
నీవూ నేనూ కలిసి చేస్తున్న ప్రయాణం
నింగినీ నేలనూ గాలిస్తున్నది

# మరపు - వెరపు

ఈ భూమిమీద
మనిషి పుట్టకముందే
మాతృమూర్తి భూదేవి
పుట్టబోయే తన బిడ్డలకోసం
సేకరించి పెట్టింది, జీవనభృతి -

గాలి, నీరు, వెలుతురు
అగ్గి, బొగ్గు, కలప, ఖనిజం
ఏది ఎలా వాడుకోవాలో
మట్టిలోనుంచి జీవితాన్ని
ఎలా తోడుకోవాలో
నేర్చుకోవడానికి
'ప్రకృతి పాఠశాల' పెట్టింది -

మనిషి పుట్టాడు
కాని అతని వెన్నంటి మరపు పుట్టింది
తల్లి ఒడివి వీడిన బిడ్డడు
ప్రకృతి బడిని చూచి భయపడ్డాడు

చదువు నేర్చుకోవడంకంటే
స్వార్థం నేర్చుకోవడం మేలని
భ్రమపడ్డాడు -
మంచిని చేదుగా చెడును తీపిగా
భావించడం మొదలుపెట్టాడు
తన కష్టసుఖాలు నాగరకతగా
తన ఇష్టాయిష్టాలు సంస్కృతిగా
చరిత్రకు శ్రీకారం చుట్టాడు
వెలుతురంటే వెరపుతో
మాయదారి మరపుతో
దైవత్వంవైపు ఎదగవలసిన మనిషి
దానవత్వం దారి పట్టాడు
మెట్టుమీద మెట్టు కట్టి
మింటి కెత్తవలసిన మానవజాతి చరిత్రను
మెట్టుక్రింద మెట్టు పెట్టి
పాతాళపు చీకటిపుట్టలోకి నెట్టుతున్నాడు -

పాతాలు, గుణపాతాలు
నేర్చుకోవలసిన బుద్ధిజీవి మానవుడు
మూర్ఖత్వ మతాలు
సంకుచితత్వ మతాలు

అజ్ఞాన పీఠాలు పెట్టి
అవనితల్లి ఆశలమీద
అంధకారం పోస్తున్నాడు
సమతానంద ఆశయానికి
స్వార్థ పంకిలం పూస్తున్నాడు
మననం తక్కువైపోతోంది
మరపు ఎక్కువైపోతోంది
మానవ జీవిత వృత్తంలో
నిర్మాణం తగ్గిపోతోంది
నిర్మూలన పెరిగిపోతోంది
ప్రగతి కథా ఇతివృత్తంలో

# పుస్తకంనుంచి వాస్తవంలోకి . . .

నా కవితలు
పుస్తక పుటల్లోనుంచి
హఠాత్తుగా వెళ్లిపోయాయి
వాటి భావాత్మలను బంధించిన
చీకటి పంజరాలనుంచి
వాటి స్వప్నాలను,
ఊపిరాడని మాటలతో కట్టిన మూటల్లోనుంచి
యదార్థ జీవన స్వేచ్ఛలోకి
ఎగసిపోయాయి -

అందమైన ఊహల్ని దోచుకొని
గ్రంథాలలో దాచుకున్న
నా స్వార్థాన్ని నిరసిస్తూ
సామాజిక జీవితంలో
సజీవ ప్రకృతి శోభలో
అంతర్భాగంగా రమ్మని
సమత పంపిన ఆహ్వానాన్ని స్వీకరిస్తూ
కాగితపు కటకటాలనుంచి
నా కవితలు పారిపోయాయి -

మస్తకంలోనుంచి తీసి
పుస్తకంలో కట్టిపెట్టిన
అర్ధరాత్రి ఒంటరిగా ఇంటికిపోయే
అందాల బాల డెందంలో
నిశ్వసించే ఆత్మవిశ్వాసంగా చూశాను
అబలత్వంలో సబలత్వం ప్రసరించే
అపూర్వానుభూతిగా దర్శించాను-

జీవిత చదరంగంలో
స్వార్థశకునత్వ మాయోపహతులై
ఇడుముల కారడవుల పాలైనా
వంచనల నెదిరించే పంచప్రాణులుగా గుర్తించాను -

మనిషికి దైవత్వాన్ని
దైవానికి మానవత్వాన్ని బోధిస్తూ
నింగికీ నేలకూ మధ్య
బంధుత్వాన్ని సాధిస్తూ
"ఆనందోబ్రహ్మ" సూత్రాన్ని
అందరికీ వర్తింపచేస్తూ
త్యాగ యోగ భోగతంత్రులమీద
అద్వైత రాగమూర్తిగా పాడుకుంటున్న
నా అక్షరభావ నిజశక్తిని దర్శించాను
నా విముక్త కవితాత్మ విజయానికి హర్షించాను.

# అల్లరి నీటి అలలు

కడలి గుండెమీదికి ప్రాకి
అల్లరిచేసే అలల బాలలు
కోరుతున్న గొంతెమ్మకోరిక లేమిటో
అంతులేని మహాశక్తి సాగరుడు
ప్రసాదించలేని వరా లేమిటో!

అడిగీ అడిగీ ఏడ్చీ ఏడ్చీ
అలసిపోయిన అమాయికోర్మికలు
నురుగులు గ్రక్కుతూ వ్రాలిపోతున్నాయి
పుడమితల్లి పరచిన
ఇసుక పాన్పుల్లమీద
సైకతాలమీద పొరలి పొరలి
ఒంటికి అంటిన మంటిని
కడుక్కోవడానికి
మళ్లీ తెల్లచొక్కాలు తొడుక్కోవడానికి
జలధిలోకి దూరిపోతున్నాయి
అల్లరి నీటి అలలు
నిజాలు తెలియని కలలు -

నీటిలో పుట్టి నేలగట్టుకు చేరుతూ
నేలను ముట్టి నీరధిలోనికి జారుతూ
ఆడుకొనే ఆటపేరే జీవితమా
పాడుకొనే పాటపేరే పరమార్థమా
కడలి లోతులు చేరుకోలేని అలలు
పుడమిమీద నిలిచిపోలేని తరగలు
అటూ ఇటూ ఊగడమేనా
ఎటూకాని
దేశకాల ద్రిమ్మరులేనా?

# ప్రగతి ప్రదర్శనం

ఒకటవ జనవరి వచ్చిందంటే
ఒళ్లు పులకరిస్తుంది హైదరాబాదుకు
ఇళ్లల్లోనుంచి, వీధుల్లోనుంచి
బడుల్లోనుంచి, ఆఫీస్సుల్లోనుంచి
బయటపడి
బాలానందంతో విహరిస్తుంది భాగ్యనగరం
ఎగ్జిబిషన్ మైదానంలో
ప్రగతి ప్రదర్శన ఉద్యానంలో -

ఉస్మానియా విశ్వవిద్యాలయం
ఊపిరిపోసిన పట్టభద్రులు
నాటిన ఈ "నుమాయిష్" తోట
నేటికీ బంగారం పూస్తున్నది
కాలపుగుండెలో క్రాంతిసౌరభాలు వీస్తున్నది
యేబది వంసతాల శోభాహస్తాలు సాచి
కవికోకిలలను ఆహ్వానిస్తున్నది
మనిషికీ యంత్రానికీ మధ్య
మైత్రిని వెలిగిస్తున్నది -
నిజాం నవాబుల కళ్లల్లో
నింగినీలిమలు పొంగించిన

మూసీతటిహాసం ఇది
భాగ్యనగర భాగ్యం ఇది -

రాజగోపాలాచార్యుల
రాజేంద్ర ప్రసాదుల
రాధాకృష్ణ పండితుల
అభినందన చందనాలను
గుండెనిండా అలదుకొన్న
విజ్ఞాన వినయవాటిక ఇది
భాగ్యనగర భాగ్యమిది -

చాచాజీ సమదర్శనేందిరా జీవకేతనమై
బ్రహ్మానంద చేతనమై
చెన్నారే భాగ్యనగర భాగ్యమిది
విద్యా విజ్ఞాన రసజ్ఞ జిజ్ఞాస
యజ్ఞంలో ప్రభవించిన
క్రాంతికళా కల్పక వనమిది
భాగ్యనగర భాగ్యమిది -

గనులల్లో, చేతిపనులల్లో
కర్మాగారాల్లో, వ్యాపారాలల్లో
రూపించిన ప్రగతిదీపాల పండుగ ఇది
భాగ్యనగర భాగధేయం ఇది -

ఎక్కడ కలిసికొందాం?
ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో-
కోరికలు తీర్చే వస్తువుల్ని
ఎక్కడ కొనుక్కుందాం?
ఈ దేశ భవిష్యత్తు ఎలా ఉందో
ఎక్కడ కనుక్కుందాం?
ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో -

రాధతో ఎగ్జిబిషన్‌కు పోయే
రసికులు కొందరు
బాధతో ఎగ్జిబిషన్‌కు పోయే
భావుకులు కొందరు
రాధా బాధా మాధవం
బోధపడని సామాన్యుల
వెదురుబొంగు జీవితాలలో
వేదనాదాలు పలికించే
విచిత్ర బృందావనం
ఈ విశాల విపణి వీధీ విహరణం -

రంగులరాట్నాలమీద
కలల కనుపాపలను త్రిప్పుతూ
నింగికీ నేలకూ నడుమ
చుక్కల చూపులు చెక్కుతూ

ఆడుకుంటున్నది
అందాల విరుల వేణినై
పాడుకొంటూంది రాగవీణా పాణినై -

ప్రదర్శకుల సందర్శకుల
ప్రమోద వేదికలమీద
కమ్మని కవితలల్లుతూంది
సాహిత్యాల పూవుల్ని
సంస్కృతుల తావుల్ని
సామరస్య, సౌమనస్య హస్తాలతో చల్లుతూంది -

స్వర్ణోత్సవ సంరంభంలో
కొత్త ఆశల ఆశయాల
కొమ్మలను పెంచుతోంది
ఆబాలగోపాలానికి అభ్యుదయం పంచుతూంది
ప్రకృతి సంపదల మహిమల
ప్రదర్శనశాల ఈ లోకం
మానవ సంపదలను దర్శించి హర్షిస్తోంది
బాపురే! భావాకాశం నేడు వర్షిస్తోంది.

# నిషిద్ధ కవిత

ఈ సంక్రాంతికి కవిత వ్రాయద్దని
చలితుపాను హెచ్చరించింది
క్రొత్తగా వచ్చిన సంవత్సరం
గొంతుచీల్చుక ఘోషించింది
కారణం ఏదైనా కవితమాత్రం రాయద్దంది
అవును, ఇప్పుడు నే నేది వ్రాసినా
తప్పుటర్థమే వస్తుంది
ఇప్పుడు నేనేది చెప్పినా
ముప్పు ముంచుకొస్తుంది
ఈ దేశ పరిస్థితిని వర్ణించే భాష నాకు రాదు
ఈ కాలం కళ్లల్లోని భావం కనిపెట్టే శక్తి నాకు లేదు
సత్యం చెపితే సహించే సాహసం ఎవరికీ లేదు -

అందంగా అబద్ధాలు చెప్పే పందాలను,
నిషేధించగల రాజ్యాంగం ఇంకా రాలేదు
గాలికీ, పూలకూ, పక్షులకూ, వృక్షాలకూ
రంకురాజకీయం నేర్పిస్తున్న రాక్షసత్వాన్ని
నిషేధించే చట్టా లింకా పుట్టలేదు -

మతమంటే ఏమిటో చెప్పిన దేవుణ్ణి
ఇప్పుడు మాట్లాడవద్దంటున్నారు
మనుషులంతా ఒకటే అన్న వాదం
ఇపుడు మాయాజూదం అంటున్నారు -
చరిత్ర చేసిన నేరానికి శిక్షవేసే శాసనం కోసం
న్యాయమూర్తులు వెదకాలట
సయోధ్య ఎక్కడ సాధ్యమైనా
అయోధ్యలో మాత్రం కాదట
మందిర్ మసీదు చక్రవృత్తంలోనే
మన జాతి భవిష్యత్తు సాగాలట
ఇక, ఈ విషవలయంలో చిక్కిన దేశంలో
రసకవిత వినేవా డెవడట!
హింసా విధ్వంసాలు వెర్రెత్తిన వీధుల్లో
హితబోధలు ఎవరికి కావాలట!

సారాను నిషేధించండి! నారీజన నినాదం
తాగడం మాన్పించండి!
తత్వజ్ఞుల సందేశం - ప్రభుత్వజ్ఞుల ఆదేశం
తాగడం పోతే సారా పోతుందో
సారా పోతే తాగడం పోతుందో
తేల్చే పరమహంస లెవరో!

తెలిపే కవివతంసు లెవరో!
దక్షిణాన భగభగలాడిన భాస్కరుడు
ఉత్తరాయణ పరాయణుడు నేడు
ఉత్తరాన చలికి వణికే హిమగిరి సింహానికి
ఉష్ణరక్తం ప్రసాదిస్తాడో
కర్కాట మకర రేఖలమధ్యే
వృధా కాలక్షేపం చేస్తాడో!

గంగిరెద్దుల గంతులగూర్చి,
గుమ్మడి పూలగుండెలగూర్చి
ముంగిళ్లకు ముద్దులు పెట్టే గొబ్బిళ్లనుగూర్చి
ముసుగులో ముద్దకట్టిన ముదుసళ్లనుగూర్చి
జిగిబిగి కౌగిళ్లు చుట్టిన యువదంపతులనుగూర్చి
మనసును మనసును కలిసే మమతా నేత్రాలగూర్చి
మనిషిని మనిషిని కలిపే సమతాసూత్రాలగూర్చి
నేను వ్రాసిన కవితలన్నీ ఏటిలో కలిసిపోయాయి
కన్నీటిలో కరిగిపోయాయి
రంగు రంగుల నా దేశశక్తి ప్రదర్శనకు
రక్తం పులిమేశారు
మనిషికీ దేవునికీ ఒకే మాతృభాష నేర్పించిన
నా కలంగళం నొక్కేశారు.

# రామానుజరావు

తెలుగుతల్లి దరహాసాన్ని
తెలుగుభాష తీయందనాన్ని
తెలుగు సాహిత్య సౌరభాలను
తెలుగుబిడ్డ ఆవేశాన్ని
తెలుగుగడ్డ అభిమానాన్ని
రంగరించి రచించిన వర్ణచిత్రం
రామానుజరావు -
రామానుజరావంటే
దేవులపల్లి రామానుజరావే
ఉపమానాలకు చిక్కని
అనుపమాన వ్యక్తి ఆయన
చెలిమికితప్ప బలిమికి శక్యంకాని
శక్తి ఆయన
తెలుగు చొక్కా తెలుగు పంచె ధరించి
తెలుగు రిక్షాలో పయనించే
ఆయన నిత్యనూతన జీవితం
ఆంధ్ర సారస్వత పరషద్వాణికే అంకితం
ఛలోక్తులు రువ్వుతూ
గుండెనిండా నవ్వుతూ
వేషభాషా వివాదాలు మాపే

వేదాంతి ఆయన
సంస్కృతిని సంతృప్తితో కొలిచే
తాత్వికు డాయన
యౌవనం తప్ప
వృద్ధాప్యాన్ని సహించని దేహం ఆయనది
వాడా వీధీ వీడూ వంటి
విలాసం లేని గేహం ఆయనది
పద్యం వ్రాసినా ఉపన్యాసం చేసినా
వ్యాసం వ్రాసినా, పరిశోధన చేసినా
మొక్కవోని వాక్కు అతనిది -

షష్టి పూర్తులకు
సహస్ర పూర్ణిమలకు
స్వర్ణోత్సవ, వజ్రోత్సవాలకు
అతీతమైన
మృత్యుంజయ డమరుకహాసం అతనిది
నిత్య సత్య నిరాడంబర వేషం అతనిది
శిథిలంకాని శిశిరంలేని జీవితం అతనిది
బాపురే! ఆత్మీయతకు మారురూపం ఆయన
ఆంధ్ర సాహిత్య చరిత్ర సౌధంలో
అక్షర దీపం ఆయన

# సంస్కరణ భావ వసంతం

వచ్చింది నవభావ వసంతం
భాషకందని సందేశం మోసుకొని వచ్చింది
సరిక్రొత్త ఆశలు చిపురించిన
సహజీవన నందనంలా
తూర్పు పడమరలు పంచుకొనే
పరస్పరాభివందనంలా విరిసింది
చేదు, తీపి నిజాలను
చెల్లీ చెల్లని ఇజాలను
రంగరించి రచించిన చిత్రం ఈ చైత్రం
సత్యరాగ సంగీత గాత్రం ఈ చైత్రం -

రక్తం పూస్తున్న కాశ్మీరులోయనుండి
విద్వేషం వీస్తున్న కన్యాకుమారి తీరంవరకు
విస్తరించిన భారతాత్మ వేదనకు
విముక్తి కలిగించడానికి, అవతరించిన
ఆశావాది ఈ ఉగాది-

విదేశీ మారకద్రవ్యం వెల్లువగా ప్రవహిస్తున్నా
స్వదేశీ ఉత్పత్తులు సమృద్ధిగా లభిస్తున్నా

క్రొత్త ఆర్థికవిధానమోహిని
చిత్తశుద్ధిగా బోధిస్తున్నా
శేష ప్రశ్నలకు సమాధానం
చెప్పలేని దేశానికి
దారిద్ర్యరేఖను దాటలేని
దౌర్భాగ్య జనావళికి
బుద్ధిబలంకన్నా త్రికరణశుద్ధి బలం కావాలని
ప్రకటించే ఉపజ్ఞాకోకిలం ఈ ఆమని
అంతంలేని అవినీతి
అలసటలేని స్వార్థం
కలిసి ఆడుతున్న కపటనాటకానికి
చరమగీతం పాడగలిగే
వివేక జనవాణి ఈ శుభోదయపాణి -

దారితప్పిన కాలాన్ని చేరదీసి
గమ్యంవైపు నడిపిస్తానని
సింహగర్జన చేస్తున్న చైతన్యం ఈ ఉగాది
కండబలంకన్నా మిన్న
గుండెబలం కావాలని విశ్వసిస్తున్న
యదార్థవాది ఈ ఉగాది-

పట్టణాలను పట్టుకొని ప్రాకులాడే
పల్లెసీమలకు
పంచాయతీరాజ్య పంచామృతం అందించి
అబల అనుకున్న స్త్రీలలో మేల్కొన్న
ప్రబలశక్తి రుచి చూపించి
సమతా ధర్మశాసన చక్రం త్రిప్పుతున్న
సంస్కరణ భావ వినోది ఈ ఉగాది-

అడిగినా అమ్మ అన్నం పెట్టదనే అపోహతో
అపాయం లేని ఉపాయం లేదనే ఆవేశంతో
అలిగిపోయి అడవిపాలైన
అజ్ఞాత సోదరులను
ఇంటికి తిరిగిరమ్మని పిలిచే
ప్రేమశీలి అనుభవశాలి ఈ ఉగాది -
సకల కళా సంస్కృతీ క్షేత్ర
విజయగీతాపారాయణ
విప్లవేతిహాసం ఈ మధుమాసం

# భ్రమ - ప్రమ

ఆకాశం
అతి విశాలంగా ఉంది
నా ఆలోచనలు దాన్ని
అలుముకోలేకపోతున్నవి
ఆచ్ఛాందిచలేకపోతున్నవి
కోటి కోటి నక్షత్రనయనాలతో
నన్నుచూచి జాలిపడుతూంది మిన్ను
నా మట్టిబుర్రలో పుట్టిన ఊహలు
కట్టుకుంటున్న గాలిమేడల్ని చూచి
గుట్టుగా నవ్వుకుంటూంది నింగి
తానెంత ఎత్తుందో
తనకే తెలియని నభం
కాంతి కిరణాలతో తన కొలతలు తీస్తున్న
కాలాన్ని చూచి
నవ్వాలో ఏడ్వాలో తెలియక
నివ్వెరపోతున్నది -

భూమిమీద వ్రాస్తున్న చరిత్రలన్నీ
బూడిదయై, ధూళిలో కలిసిపోతుంటే

మనిషి తనపేరుకోసం
కొట్టుక చస్తున్నాడు
ఈ లోకంలోనే కాదు
ఇతరలోకాలలో కూడా
తన సుస్థిర అస్తిత్వంకోసం
అడ్డమైన నాదాలను
పట్టుకు చస్తున్నాడు.

వ్యాసార్ధం ఎంతో
తెలిసికోజాలని విహాయసం
తన దృక్ దిక్చక్రంమీద వ్రాలినట్లు
తన మాటలు పాటలు విని
తన్మయత్వం చెందినట్లు
"భ్రమ" పడుతున్న మనిషిని చూచి
"ప్రమ" పడుతున్న ఆవేదన బహుశః
ఆ ఒక్క భగవంతునికే తెలుసు.

# మన మతం మానవతం

కులాల రంగులు పులిమి
మతాల దుస్తులు తొడిగి
మనిషిని మరుగుపరచవద్దు
మానవత్వాన్ని కించపరచవద్దు
వలువలే విలువలను కొనే సిద్ధాంతాలు పోవాలి
రంగులే రూపాలనుకొనే రాద్ధాంతాలు పోవాలి -

మనిషినీ మనిషినీ ముడివేసేది మతం
విడదీసేది స్వార్థం
మనసునూ మనసునూ కలిపేది మానవ భాష
విడదీసేది దానవ ఘోష
మనకు కావలసింది మానవతా మందహాసం
మాసిపోవలసింది దానవతా వికటహాసం -

ఒక దేవుణ్ణి చంపి
మరొక దేవుణ్ణి బ్రతికించలేం
ఒక మతాన్ని ఓడించి
మరొక మతాన్ని గెలిపించలేం
ఉన్న దేవుడు ఒక్కడే, అన్ని మతాలు ఒక్కటే
మందిరమైనా మసీదైనా

చర్చ్ అయినా గురుద్వారా అయినా
అక్కడ మనిషి సమర్పించే భక్తి ఒకటే
సాధించే శక్తి ఒకటే
భక్తి భక్తి కలిస్తేనే భగవంతుని శక్తి
మానవత్వం గెలిస్తేనే మనిషి బాధావిముక్తి
కులం గోడలు కూలిపోతేనే
చైతన్యం జాతి రక్తం అవుతుంది
మతకలహాలు మానుకుంటేనే
సౌభాగ్యం దేశ లక్షణం అవుతుంది -

పుట్టిన వారందరి తీరు ఒకటే
గిట్టిన వారందరి దారి ఒకటే
మధ్యలో మనకు మనం పులుముకున్న
మలినం కాకూడదు కులం
మనకు మనం చేసుకున్న మోసం కాకూడదు మతం
కులాతీత మతాతీతమైన
కుటుంబంగా మానవులు కూడి బ్రతకాలి -

ప్రేమను మించిన ధర్మం లేదు
సేవను మించిన దీక్ష లేదు
సమతను మించిన సత్యం లేదు
సామరస్యాన్ని మించిన సౌందర్యం లేదు
ఒకే మతం, ఒకే కులం, ఒకే జాతి మనమందరం
మన మార్గం మన గమ్యం
సత్యం శివం సుందరం

# జన్మదినం

నీవు జన్మించిననాడే
నీ జన్మదినంకూడా జన్మించింది
నవ్య నవ్య వసంతాలు పరిమళించే
నీ జీవిత క్షేత్రంలో
నీ జన్మదినం వేదనాద కోకిలమై రవళిస్తూనే ఉంది
గతాగతాల దిక్సూచియై
కాలానికి దారి చూపుతూనే వుంది-

పుట్టిన ప్రతి మనిషికే కాదు
చెట్టుకూ, పిట్టకూ
కొమ్మకూ, రెమ్మకూ
రాయికీ, రత్నానికీ
అన్నిటికీ ఒక జన్మదినం అంటూ ఉంటుంది
జీవిత కొలమానం ఉంటుంది
అయితే,
అన్ని జన్మదినాలకూ జన్మమిచ్చే
కాలపు జన్మదినం ఏది?
దేశం పుట్టిన రోజేది?
అకాశం పుట్టిన రోజు

నవగ్రహాలు నక్షత్రాలు చివురించిన రోజు ఏదో
ఎవరికైనా తెలుసా?
వెలుగు చీకట్లు ప్రభవించిన రోజు
ఏ తల్లికైనా తెలుసా?
పుట్టిన రోజు లేకుండానే పుట్టిన
సృష్టి రహస్యాల గురించి
నీవు పుట్టిన రోజు ఆలోచిస్తున్నాను
అనాది అనంత తత్వంలో
నీ ఆవిర్భవాన్ని అవలోకిస్తున్నాను
లోకాభ్యుదయాన్ని దర్శిస్తున్నాను
విస్తరిస్తున్న విజ్ఞాన వటవృక్షంక్రింద
ప్రజ్వలించే నీ ప్రజ్ఞాన శిరస్సుమీద
అభిమానాలు, అనురాగాలు, ఆశీస్సులు
ఆకాశంనుండి వర్షిస్తున్నాయి
నీ జన్మదినోత్సవంలో పాల్గొంటూ
అగణిత జన్మదినాలు హర్షిస్తున్నాయి

# ఋతుచక్రధారులు

ఈ ఉగాదికి కవిత వ్రాయను
చేదు తీపి కలిసి చేస్తున్న మాయను
అలంకారాల పల్లకీ ఎక్కించి మోయను
ప్రభవ విభవాది అరవై సంవత్సరాలే
పంచుకుంటున్న ప్రభుత్వ వారసత్వాన్ని
ప్రశంసిస్తూ పద్యాలు వ్రాయను -

పేరు ఏది పెట్టుకున్నా
ప్రతీ సంవత్సరం
పఠిస్తున్న పంచాంగం ఒకటే
పాలిస్తున్న యంత్రాంగం ఒకటే
పాటిస్తున్న మంత్రాంగం ఒకటే -

కోకిల పాటలతో
పూవుల తోటలతో
ప్రత్యక్షమౌతున్న ప్రతీ క్రొత్త సంవత్సరం
బాధల మంటలు
బెడదల వరదలు
దుర్మార్గాల హిమపాతాలు

దోపిడీల శిశిర ఘాతాలు
యథావిధిగా సృష్టించి
ఏమి ఎరుగనట్లు నిష్క్రమిస్తుంది
ఏ సంవత్సరమైనా
అందుకే
హాసంతో వచ్చి
మోసం చేసి పోతున్న
ఈ కామరూప కాల పాలకులను
ఇక నమ్మను
మారుతున్నట్లే మారి
మళ్లీ మొదటికి వచ్చే
ఈ ఋతుచక్రధారులను నమ్మను
మాయలు
చేసేవాళ్లు మారడం లేదు
చూసేవాళ్లు మారుతున్నారు
కాబట్టే, పాత చింతకాయ పచ్చడికి
క్రొత్త తలకాయ ఊగుతూంది
చర్వితచర్వణమైన చరిత్ర
సగర్వంగా సాగిపోతూంది

# చీకటిసేవలో వెలుతురు

చీకటంటే వెలుతురుకు భయం
వెలుతురంటే చీకటికి వినోదం
అన్నీ ప్రసాదించేది, ప్రకటించేది వెలుతురు
దాచుకొనేది, దోచుకునేది చీకటి
మట్టిదీపమైనా, మార్తాండబింబమైనా
తట్టుకోలేని కరాళకాలసర్పం తమస్విని -
కాంతితో కపటనాటకం ఆడే కామరూపిణి ధ్వాంతం
ధర్మప్రభతో పాచికలాడే మాయాశకుని చీకటి
గూడులేనివారిని వంచించే సాలెగూడు చీకటి

వెలుతురు సృష్టిస్తుంది - చీకటి హరిస్తుంది
వెలుతురు శ్రమిస్తుంది - చీకటి భుజిస్తుంది
తన స్వార్థపరత్వ సాధనంకోసం
చీకటి, వెలుతురును చేరదీస్తుంది
చీకటి, తన అధికార పత్రాలమీద
వెలుతురుతో సమ్మతి సంతకాలు చేయిస్తుంది
తూర్పు పండించే కాంతిని నేర్పుగా కబళించి
పడమటింటిలో విలాసాల విందు చేసుకుంటుంది -

కళ్లుమూసుకొని ఆలోచిస్తాయి
కల్లోల తిమిరాలు
కళ్లుతెరచి పరితపిస్తాయి
కాంతి కిరణాలు
సాధ్వీసీతనైనా, సత్యభామనైనా
చెరబట్టే రావణత్వం చీకటి
భయపెట్టే నరకత్వం చీకటి
చీకటితలుపు త్రోయనిదే వెలుతురుకు ప్రవేశం లేదు
చీకటిని సవాలు చేయనిదే
వెలుతురుకు వికాసం లేదు.

అయితే జరుగుతున్నదేమిటంటే
చీకట్లను మెప్పించాలి కాని, నొప్పించకూడదు
చీకటి మనసు కరగించాలి కాని, రగిలించకూడదు
అందుకే, వెలుతురును ముందుపెట్టుకొని
చీకటి చేసుకొంటున్న పర్వం దీపావళి
చీకట్ల పాపావళి అభినయించే
రంగురంగుల రూపావళి - దీపావళి
అలంకారాల జోలికి పోకుండా
అసలు విషయం చెప్పమంటోంది
సత్యాకాశవాణి - అభ్యుదయముద్రాపాణి -

మత్తెక్కిన చీకటి వికటహాసంలా
మతాబాలు ప్రేలుతున్నాయి
దిక్కులేని పక్షుల్లా దీపాలు బెదురుతున్నాయి
విజయగర్వంతో ఊరేగే చీకటికి
గౌరవాభివందనం చేసే గార్డుల్లా ఉన్నాయి
బారులు తీరిన దీపాలు
రెచ్చిపోయిన రేయి చేస్తున్న హెచ్చరికలే
విచ్చుకపడుతున్న చిచ్చుబుడ్లు
ఆకాశమంత ఎత్తు అలుముకున్న
తమఃప్రతాపాన్ని
చూపడానికి ఎత్తిపట్టిన దివిటీలు
ఈ తారాజువ్వలు, మిణుగురు రవ్వలు -

దీపావళి అంటే చీకటిపై వెలుతురు విజయం
అనుకున్న అపోహ తొలిగిపోతున్నది
వెలుతురును లొంగదీసుకున్న చీకటి వేడుకలన్న
వాస్తవానుభూతి కలుగుతున్నది -

ఆకలిడొక్కలు - అలసిన హక్కులు
సొలసిన రెక్కలు
దిక్కులేని చుక్కలు, వెలుతురు ముక్కలు

చీకటి జిందాబాద్ అంటూ చేయెత్తి జై కొడుతున్నాయి
సత్యం, శివం, సుందరం
చీకటి పన్నిన హత్యావ్యూహంలో
చిక్కుకొని, తెల్లజండాలు పడుతున్నాయి
చీకటిన్యాయవాదులు వెలుతురురక్షాయోధులను
టపాకాయల్లా ప్రేల్చే
దీపావళిని ఓదార్చేదెట్లు?
వెలుతురు పోషిస్తున్న చీకటికి
చరమగీతం వ్రాసేదెట్లు?

# తెలుగు నుడికారాలు

తెలుగు పౌరుషం గురించి మన కవులు వ్రాసిన
తీవ్ర కవితల ప్రభావం కాబోలు
తెలుగువాళ్లంటే ఎవరో తెలియజేయడానికి
తెగ పోట్లాడుకున్నాం -

నీకు స్వార్థం జాస్తి అంటే
నీకు సంస్కారం నాస్తి అంటూ
సోడాబుడ్లు పగిలేటట్లు
కొట్లాడుకున్నాం -

కారంపూడి కారాలు నూరితే
మిర్యాలగూడ మిర్యాలు నూరింది
గాలికొండ డొక్క చీలుస్తానంటే
గోలకొండ డోలు కడతానంది
గోదావరి వరదలెత్తితే
మంజీర మంటలెత్తింది
తీయని భాషామతల్లిని
తీరు తీరు యాసలు వెక్కిరించాయి
ఆకలీ ఆవేశం

ఆలోచనల్ని ధిక్కరించాయి
అయితేనేం
అపార్థాల వాన వెలిసింది -
ఆరు రంగుల హరివిల్లు విరిసింది.

సహజీవనం కోరిన తెలుగు ప్రజా ప్రహ్లాదునిలో
సంజీవం పొందిన తెలుగు సంస్కృతిని
బ్రహ్మానందం చెందిన తెలుగు భారతిని
ముక్కలు చేయాలనుకున్న
దురాశా హిరణ్యకశిపుల్ని
సమైక్యతా నారసింహం మళ్ళీ
సంహరించిపోయాడు
" జయోస్తు! తెలుగు జాతికి విజయోస్తు " అని
ఇలవేల్పుల గళరావం వినిపించింది
"నలుగు రెవరో తప్పుచేస్తే
నాలుగు కోట్లను శిక్షంచలే"నని
ప్రగతీందిర ప్రవచించింది

# పట్టుబడని గుట్టు

పట్టుకోలేని ఒక పెనుభూతం
పట్టుకుంది ఈ దేశాన్ని
కనిపిస్తూ కనుపించక
వినిపిస్తూ వినిపించక
కల్లోలం సృష్టిస్తున్నది
కులం, మతం, వర్గం ఏదైనా
కలం, హలం, యంత్రం ఏదైనా
తన స్వాధీనంలో ఉంచుకునే
తంత్రం మంత్రం దానికి తెలుసు
అది ఓట్లపెట్టెల్లో చొరబడి
సీట్లు సంపాదించగలదు
నల్లబజారులో నిలబడి
న్యాయాన్ని వేలం వేయగలదు -

అడవిలో తిరిగే ఆవేశాలకు
అది దొరకదు
ఊరిలో ఉరిమే చట్టాలకు
అది చిక్కదు
మన దేశాన్ని ముక్కలు చేసే కత్తెర
తన చేతిలో ఉంది

మన ప్రగతిపక్షి రెక్కలు నరికే
బాణం తన పొదిలో ఉంది
గంగా కావేరీ సంగమస్వప్నాన్ని
భంగం చేసే యుక్తి దానికి తెలుసు
జనగణమన గీతంలో
వందేమాతర సంగీతంలో
అనర్థాలు, అపశ్రుతులు దూర్చే కళ దానికి తెలుసు
అద్వైతానికి ద్వైతం నేర్పిస్తుంది
భాషలకు ద్వేషం నేర్పిస్తుంది
దురాశలకు దోపిడీ నేర్పిస్తుంది
స్వార్థానికి పరమార్థం కల్పిస్తుంది
త్రికరణాల శుద్ధిని అపహరిస్తుంది -

అది పన్నే చీకటి వ్యూహంలో
అర్జునులైనా అభిమన్యులై పోతున్నారు
దాని కర్మక్షేత్రంలో పార్థసారథులు కూడ
స్వార్థసారథులై పోతున్నారు
దశావతారాల ధర్మం తెలిపిన
ఈ అపూర్వ మాయాభూతం
ఏ అవతారం వచ్చినా ఫరవాలేదన్నట్లు
ఎల్లెడలా విజృంభిస్తూంది
మనిషిని నమ్ముకున్న మానవత్వం
మతిపోయి విలపిస్తూంది.

# కాశిలో కవితాభిషేకం

విశ్వేశ్వరుణ్ణి చూడటానికి
వెళ్లాను కాశికి, వారణాసికి
చంద్రవంక తీరంమీద కొలువున్న
గంగాతరంగాంతరంగ లింగమూర్తికి
భయంలేని భక్తిని సమర్పించి
బోధపడని బాధలు విన్నవించాను
భజగోవిందం భజగోవిందం అంటూ
ఆది శంకరులు
బ్రహ్మానందం పంచిపెట్టిన ప్రాచీన నగరంలో
అర్వాచీన సమస్యలమూట విప్పాను -

అహం బ్రహ్మాస్మి - త్వమేవాహం
అద్వైత తత్వ బోధనలు
మనిషినీ దేవుణ్ణి ఒకటి చేయలేకపోయినా
మనిషినీ మనిషినీకూడా సమానం చేయలేకపోతున్నాయి
వేద వేదాంగాలు
భగవద్గీతలు బ్రహ్మసూత్రాలు
సత్యాన్ని పీడిస్తున్న స్వార్థానికి

సమతాతత్వాన్ని బోధించలేకపోతున్నవి
విశ్వమంతా విహరించే కాంతికిరణాలు
రంగురంగుల చీకట్లరహస్యాలు
కనిపెట్టలేకపోతున్నాయి
విజ్ఞాన విషవృక్షాలమీద
విలపిస్తున్నాయి మనవతాకోకిలలు
తమసోమా జ్యోతిర్గమయ తల్లక్రిందులై
జ్యోతిర్మా తమసోగమయ అవుతున్నది
సంభవామి యుగేయుగే అన్నవాడు
ఏ రూపంలో పుట్టాలో తెలియక చస్తున్నాడు -

నా వింత బాష్పమంత్రపుష్పసమర్పణం చూచి
విశ్వనాథుడు లీలగా నవ్వాడు
"కింకర్తవ్యం" అన్నట్లు క్రీగంటిచూపులు రువ్వాడు!
ఆది శంకరుల అద్వైతాన్ని
ఆధునీకరించి ఆచరణలో పెట్టించమన్నాను
గంగా కావేరిని ఒకటిచేసే జలసూత్రం చెప్పమన్నాను
ప్రజగోవిందం ప్రజగోవిందం గోవిందం ప్రజ అంటూ
ప్రజాభజన చేసే భక్తి శక్తిని ప్రసాదించమన్నాను

కుబేరులూ కుచేలురూ కలిసి

త్వమేవాహంగా జీవించే

నిత్య సత్య సమతాసౌభాగ్యం పంచమన్నాను

ప్రాంతీయ విభేదాలకు

భాషాపర వివాదాలకు

మతోన్మత్త కలహాలకు

అద్వైతం నేర్పించే ఆత్మజ్ఞానం పెంచమన్నాను

సత్యం శివం సుందరం

మానవ జీవితమందిరం చేయమన్నాను

కాశీపతే మాకు నీవే గతి అంటూ

నా కవితాభిషేకాన్ని ముగించాను

## ఏ రుద్రుడో ఈ ఆరుద్రుడు

షష్టిపూర్తి చేస్తున్నారా
జరా మరణాలు లేని ఋషికి
దేశ కాలాతీత మనిషికి
భద్రునికి, నిర్నిద్రునికి
ఆరుద్రునికీ -

సృష్టిచేసే దృష్టికలవానికి
నిలకడలేని వయస్సును
నిశ్చల తపస్సులో నిలిపివేసినవానికి
షష్టిపూర్తి చేస్తున్నారా?
అంధకారబంధురమైన
ఆంధ్ర సాహిత్యచరిత్రను
అక్షరకాంతి చిత్రలహరిలో ఆవిష్కరించిన
అపూర్వ భావ గంగాధరునికి -

నిత్య సత్య జీవన శిఖరాలమీద
నిరంతర చిరంతన నాట్యం చేసే
క్షేమారామా సాంబశివునికి
హరునికి శివంకరునికి

అరవై ఏళ్లు వచ్చాయని
ఆర్భాటం చేయటం
అమాయకత్వం కాదా?
మామూలు మనిషితో
శాంతినేత కార్ల్ మార్క్సుతో
జర్జరుడైన జీవునితో
నిర్జరుడైన దేవునితో
"త్వమేవాహం"గా తాదాత్మ్యం చెందిన
ప్రగశీలికి ప్రతిభాశాలికీ
నిత్యపరిణామ సత్యశూలికి
వచ్చినవి ఆరు పదులు కాదు
అరవై వసంతాలు తెచ్చిన
అమృత సాహిత్యనిధులు -

కోటి కోటి తెలుగు కంఠకలకంఠాలు
కీర్తించేది
ఏ రుద్రుణ్ణో కాదు
అసలైన ఆరుద్రుణ్ణే
అసమాన శక్తిసంయుక్తుడైన
ఈ ఆరుద్రుణ్ణే

# సత్యానికి హత్యాగండం

ప్రజాస్వామ్య భారతి చేయి చాపి
తన జాతకం చూడమంది
తన చేతిగీతల, తలరాతల
రహస్యం విప్పి చెప్పమంది

“గతంకంటె ఘనంగా ఉంటుం” దనుకున్న
నా వర్తమానం
వల్లకాడై పోతూంది
ఉజ్జ్వలంగా విరుస్తుందనుకున్న నా జీవితం
కటికచీకట్లగూటిలో
కాకిలా అరుస్తోంది
ఇక నా భవిష్యత్తు ఎలా ఉంటుందో
“బాపూ నీవే చెప్పు” మంది
బెదిరిపోయిన ప్రజాస్వామ్యభారతి

“అమ్మా! నేను సాముద్రికుణ్ణి కాదు
సామాన్యుణ్ణి
జ్యోతిష్కుణ్ణి కాదు, హేతుష్కుణ్ణి” అన్నాను
సాముద్రికం తెలియకపోయినా
సత్యం తెలిసిన కవి!

నా భవిష్యత్తు ఎలా ఉంటుందో
భయపడకుండా చెప్పమంది -

తాను కన్న పీడకల ఏదో వాస్తవమైపోతుంటే
ప్రాణభయంతో పరితపించే
ప్రజాస్వామ్యాన్ని చూశాను.
ప్రజలకు ప్రాణంపోసే ప్రజాస్వామ్యానికే
ప్రాణభయం పట్టుకుంది.
రాజకీయాలను నమ్ముకున్న
రాజీవాసన ప్రజాస్వామ్యం
ప్రజల అండదండలకు ప్రాకులాడే
పసిపాప ప్రజాస్వామ్యం

ఆప్తులెవరో హంతకు లెవరో
అగుపించని చీకటిలో
దగాపడ్డ ప్రజాస్వామ్యానికి ధైర్యం చెప్పేదెలా?
అమ్మా! ప్రజాస్వామ్యమ్మా!
హత్యారాజకీయాల వలలో
కుల మతాల కుట్రల్లో
చిక్కుకున్న సింహానివి నీవు!
అకాల ఆపత్కాల ఎన్నికలకు
అనుకూల అసహాయ సాక్షివి నీవు!
భూస్వామ్యాన్ని, ధనస్వామ్యాన్ని

బలస్వామ్యాన్ని భయస్వామ్యాన్ని
ఎదిరించిన ప్రజాస్వామ్యమా!
నీ హస్తంలో హత్యాగండం ఉంది
స్వార్థ సంకుచిత శక్తులు నిన్ను
సంహరించే ప్రమాదం ఉంది -
ఏ గోదావరి లంకలోనో
ఏ కొండదారి డొంకలోనో
పొంచి ఉన్న విషసర్పాలు
నిన్ను కాటేయాలని చూస్తున్నాయి.

కలాలతో వ్రాయవలసిన చరిత్ర
కత్తులతో వ్రాస్తున్నారు
రాగంతో తడవ వలసిన ధరిత్రిని
రక్తంతో తడుపుతున్నారు
హద్దులు లేని హింసారాక్షసి
దేశ సరిహద్దుల్ని పాలిస్తున్నది -

ఏదో ఒకదాన్ని హత్యచేయందే
రాజకీయం లేదట
అందుకే, నీవు నమ్ముకున్న
విద్యనూ, విజ్ఞానాన్ని హత్యచేస్తున్నారు
స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని చిత్రహింస చేస్తున్నారు

ప్రతిభకు ప్రగతికి శిలువ వేస్తున్నారు
న్యాయాన్ని నరికివేస్తున్నారు
శాసనాలను పెరికివేస్తున్నారు

నీవు పంచిపెట్టిన
మైత్రినీ మానవత్వాన్నీ మట్టిలో పాతిపెట్టి
మనుషుల్ని కాల్చేస్తున్నారు
దేశభక్తిని కూల్చేస్తున్నారు
కలలు కనే కన్నతల్లి కడుపును చీల్చేస్తున్నారు
అన్ని ఆపదలకు తట్టుకోగలిగే
నీ ఆత్మవిశ్వాసాన్ని హత్యచేస్తున్నారు.

ఓట్లమీద బుల్లెట్ల కాట్లు కనిపిస్తున్నాయి
అమాయకుల ఆలోచనల అంతరిక్షంలో
అబద్ధాల క్యాసెట్లు వినిపిస్తున్నాయి
ప్రజలకూ ప్రజాస్వామ్యానికి మధ్య
విరోధాల అగాధాలు ఆవులిస్తున్నాయి
శుద్ధిలేని త్రికరణాలు దేనికదే
దుర్బుద్ధితో విహరిస్తున్నాయి.
అయోధ్యా రామ చరిత్రాలయంలో
మేలుకొన్న ధర్మ దీక్షా కమలాక్షి
దేశాన్ని రక్షిస్తా నంటున్నది
ఆవేశాల గట్టుమీది

ఆదర్శాల చెట్టుకొమ్మను పట్టుకొని
ఊగుతున్న జనహిత దళాలు
ప్రగతికి ప్రాణం పోస్తామంటున్నవి
త్యాగాల యజ్ఞకుండంలో
గాంధేయుల రక్తతర్పణంలో
ప్రభవించిన హస్తేందిర
ప్రజావిజయ రాజీవపీఠంనుంచి
శాంతి సమతా జీవనామృతం
పంచిపెడతా నంటున్నది

ఓ ప్రజాస్వామ్య భారతీ!
ఈ ప్రతిజ్ఞల హారతి తీసుకో
తన బిడ్డను తానే చంపడానికి
పన్నాగాలెన్నో పన్నే
హిరణ్యకశివుల బారినుండి
ఈ దేశాన్ని రక్షించడానికి
ఏదో అపురూపావతారం
ఎత్తుతాడు భగవంతుడు!
సత్యాన్ని హత్య చేయబూనే
శక్తులకు ఓటమి తప్పదు!
ప్రళయాలు ఎన్ని వచ్చినా
నీ ప్రజాశక్తికి విజయం తప్పదు!

# ఆత్మజ్ఞాన గోవిందుడు

కళ్లు మూసుకున్నా కనిపిస్తున్నాడు
చెవులు మూసుకున్నా వినిపిస్తున్నాడు
వివేకానందుడు -

ఒక శతాబ్దం క్రితం
షికాగో మహానగరంలో
భిన్న భిన్న మతాల, అభిమతాల
జీవితపథాల
విశ్వసమ్మేళన ధర్మవిచికిత్సాక్షేత్రంలో
అద్వైత గీతా రథసారథిగా
ఆత్మజ్ఞాన సమతా ధర్మవారధిగా
ఆవిష్కృతుడైన వివేకానందుడు
కళ్లు మూసుకున్నా కనిపిస్తున్నాడు
చెవులు మూసుకున్నా వినిపిస్తున్నాడు -

సత్యానికి భాష నేర్పించి
మానవత్వానికి రూపు కల్పించి
అజ్ఞాన తమస్సు కళ్లు తెరిపించిన
విజ్ఞాన ప్రజ్ఞాన గోవిందుడు వివేకానందుడు
కళ్లుమూసుకున్నా కనిపిస్తున్నాడు

రామకృష్ణ పరమహంస
ప్రేమ మానస సరోవరంలో
దివ్యానుభూతి జ్యోతిని దర్శించిన
అక్షరచక్షువు వివేకానందుడు
జనన మరణ తీరాలమధ్య
తరగలెత్తే జీవితాలకు
అనంతత్వ తత్వానందాన్ని
అనుభవైక సత్యానందాన్ని
అందిస్తున్న రససింధుడు వివేకానందుడు
కళ్ళుమూసుకున్నా కనిపిస్తున్నాడు
మనిషి మనస్సును ఆవరించిన
స్వార్థ సంకుచిత విషవలయాన్ని
త్యాగబుద్ధి త్రికరణశుద్ధియోగంతో
ఛేదించడం బోధించిన
సిద్ధేంద్రుడు వివేకానందుడు
కళ్ళుమూసుకున్నా కనిపిస్తున్నాడు

తాను ధరించిన కషాయాంబరాలనుండి
నీలి నీలాంబర నిగూఢ రహోవిహంగాలను
ఎగరవేసిన కాలవేది వివేకానందుడు
నరలోకాన్ని సురలోకం చేసే

మనిషిని మాధవుడుగా తీర్చే
యుక్తినీ ఆధ్యాత్మిక శక్తినీ
సకల బాధావిముక్తినీ ప్రసాదించిన
ఆత్మజ్ఞానేంద్రుడు వివేకానందుడు
కళ్లుమూసుకున్నా కనిపిస్తున్నాడు
చెవులు మూసుకున్నా వినిపిస్తున్నాడు -

నిరుపేదలకోసం పరితపించేవాడే మహాత్ముడు
నిర్బల నిర్భాగ్యులను విస్మరించేవాడే దురాత్ముడు
అంటూ ఘోషించిన
మానవ సేవారాధకుడు వివేకానందుడు
అందరూ భయరహితులు కావాలని
మానవులందరూ
త్వమేవాహంగా తాదాత్మ్యం చెందాలని
ఆబాలగోపాలాన్ని అలరించే
అమృతవాక్కు వివేకానందుడు
" ఆనందో బ్రహ్మ " బుక్కు వివేకానందుడు.

# హ్యూమరసవృక్షం

ఆయన ఒక జ్ఞాపకం అయిపోయాడు
అర్ధరాత్రి అలుముకున్న అంధకారపు గుండెలో
అక్షర నక్షత్రమై పోయాడు
హైదరాబాదు కార్చిన కన్నీటి కెరటాలమీద
తన శాశ్వత విలాసాన్ని **(address)** వ్రాసిపోయాడు
పంజగుట్ట శ్మశానవాటికలో
తన ఆస్తిపాస్తులన్నిటినీ మంటలుగా మార్చుకొని
వెంటతీసుక వెళ్లిపోయాడు -

కాలం అతని కాళ్లు విరిచివేసినా
జీవితానికి నడక నేర్పించాడు
వికలాంగులే సకళాంగులని నిరూపించాడు
నవ్వుల పాలౌతున్న లోకానికి
నవ్వుకోవటం నేర్పించాడు
"అనుక్షణం ఆనందంగా బ్రతకడం
నా జీవితాశయం " అంటూ
అర్థంకాని జీవితానికి అర్థం చెప్పాడు
అన్ని వాదాలను రంగరించి
ఆశావాదాన్ని చిత్రించాడు

నవ రసాల వనంలో
"హ్యూమరస" వృక్షమై విరిశాడు -

తన కలం కన్న కలలు
కవిత్వం అయినా కాకపోయినా
నిజం అవుతాయని నమ్మిన
నిజాయితీపరు డాయన
భోగానికే కాని త్యాగానికి ఓటమిలేదన్న
విజయోత్సవ వీరు డతడు
భయం భయంగా దాగిన భవిష్యత్తును
అభయమిచ్చి ఆహ్వానించే వర్తమానకారు డతడు
చతురోక్తుల చక్రవర్తియై
ఆబాలగోపాలాన్ని అలరించిన
"గోలాయణ" కర్త అతడు
అందరినీ భక్షించే
'మృత్యువుకు మరణశిక్ష విధిస్తా'నన్న
మృత్యుంజయ ధాము డతడు
గోపాలశాస్త్రి నాము డతడు

# శత్రుభయం

అన్నదమ్ముల పోరాటం
కురుక్షేత్రమై మండుతుంది
సహోదరుల శత్రుత్వం
కరబాలా అయి రగులుతుంది
ఒకే నేల పంచుకొనే జాతి
ఒకే గాలి పీల్చుకొనే జాతి
ఒకరి రక్తం ఒకరు పీల్చుకుంటే
ఒకరి ఇంటిని ఒకరు కాల్చేసుకుంటే
విశాల భారతం అవుతుంది
శ్మశాన భారతం
మానవత్వం మోస్తుంది
మనిషి కలల శవపేటిక

ప్రేమకు పరమశత్రువు స్వార్థం
ద్వేషానికి ఆత్మబంధువు స్వార్థం
స్వార్థానికి లొంగిపోయే ప్రేమ
శత్రువుకు లొంగిపోయే సైన్యం
కాలపుకన్నులో చీకటి పండించే

హృదయ దౌర్బల్యాలు
దేశపు వీధుల్లో జోలెలు పట్టించే
అసమర్థ జీవితాలు -

ప్రేమకు రూపం ఒకటే -
త్యాగం
స్వార్థం కామరూపిణి
దాని ప్రేమవేషం, త్యాగభాష
పసిగట్టే ప్రేమకు అపజయం లేదు
దాని మిత్రవేషం గుర్తించే మైత్రికి
శత్రుభయం లేదు.

# క్షరాక్షర రాక్షసి

నేను వెలిగించిన పుస్తకంలో
కాళరాత్రి చొరబడి తిష్ఠవేసింది
వెలుతురు కళ్లు మూసేసి
కాంతి 'క్షరం'
ధ్వాంతం ' అక్షరం' అంటూ
వికటహాసం చేస్తున్నది
నా భాషకు పైశాచిక హేష వేర్పిస్తున్నది
నా భావాల నోరునొక్కి
బానిసత్వాన్ని దానవత్వాన్ని
ధృవీకరించే
చీకటి పత్రాలమీద
సంతకం చేయిస్తున్నది -

తిమిరాన్ని చీల్చుకొనివచ్చిన
నా నిర్నిద్రాక్షర పక్షులకు రక్షణ లేదా?
నాదాలు కాదు నినాదాలు సృష్టించు!
వాదాలు కాదు వివాదాలు సృష్టించు!
శాంతికోసం కాదు అశాంతి కోసం తపించు!
సమతకోసం కాదు స్వార్థంకోసం జీవించు!

అంటూ
క్షుద్రభాషితాలు గండూషిస్తూ
క్షరక్షరాల రాక్షసి
నా సత్యస్వప్నవాటికలో
శైశిర ఘోష రేపేస్తున్నది -

మసిబూసి మారేడుకాయ చేసే
మాయాతిమిరం
అజ్ఞాన వేద విజ్ఞానంలో ప్రజ్ఞాశాలి
మూర్ఖత్వం దాని మార్గం
ధూర్తత్వం దాని వాహనం
వినాశనం దాని ఆశయం
విద్రోహం దాని సాధనం
వెలుతురు కంటబడితే చాలు
దాని ఒళ్ళు మండుతుంది
సత్యం ఉదయిస్తే చాలు
చావుకేక వేస్తుంది
చీకటిని విదిలించుకోవడం జీవితం
శ్రీకాంతిని ధరించుకోడం జీవితం
క్షరాన్ని అక్షరం చేసి
జీవితాన్ని రక్షించే నా అక్షరంనుంచి
జీమూతాన్ని బహిష్కరించడమే
నా జీవిత...

# నీతిలేని రతి

స్త్రీ - పురుషులు
జన్మపత్రానికి రెండు పుటలు
జీవన స్రవంతికి రెండు దరులు
ఒకే పుటగల పత్రం లేదు
ఒకే ఒడ్డుగల నది లేదు
ఒకే జండర్‌గల జాతి లేదు
స్త్రీ పురుష సంయోగమే సృష్టిరహస్య యోగం
పునఃసృష్టి కామేష్టియాగం
అందుకే
పరమపవిత్రమైంది శృంగారం
దేశ కాలాతీత వేషభాషాతీత
భావోద్దీప్తము భౌతికతప్తము శృంగారం
అది ఆత్మోన్మీలితము ఇంద్రియప్రేరితము
కామకళాశక్తికి
ప్రేమాభివ్యక్తికి
సంతానప్రాప్తికి
సహజ సుందరమార్గం శృంగారం
ఉభయలింగ సంపర్కం
ఇహ పరలోక స్వర్గం -

లక్ష్మీనారాయణులనుండి
సూక్ష్మజీవులదాక
కుబేర దంపతులనుండి
కుచేల దంపతులవరకు
భూచర, ఖేచర, జలచర
జన్మసూత్రం ఒక్కటే
అయితే
రతికి ఒక నీతి ఉంది - నియతి ఉంది
నియతి మార్గదర్శి ప్రకృతి
ప్రకృతి నీతి నియమం పాటిస్తే
రిరంస హింసకాదు, సృజన సత్యహంస
మన్మథ తాపం
శాపం కాదు, మానవవంశ దీపం
కాని, ఈనాడు
చీకటిఖండ అశ్లీల క్షుద్ర లైంగిక వ్యాపారంలో
స్వలింగ సంపర్కంలో కార్చిచ్చులా రగిలిన
"ఎయిడ్స్ వ్యాధి"
ఖండ ఖండాలకు వ్యాప్తిస్తున్నది
గుండె గుండెలో పీడకలల
గంటలు మ్రోగిస్తున్నది -

అక్రమ, అసహజ, అకాలరతి
కోరి కోరి మృత్యువ్యూహంలో దూరడం
వేశ్యా విట వ్యభిచార దురాచార సంభోగం
ఆత్మహత్యాసదృశ దుర్భర రోగాలింగనం -

ప్రకృతి విరుద్ధమైన లైంగిక ప్రవర్తనంలో
విషయసుఖం విషమవుతుంది
అధరామృత చుంబనం
మృతిచుంబనం అవుతుంది
ప్రాణంపోసే రక్తబిందువులే
ప్రాణతీసే సూక్ష్మక్రిములౌతాయి
ప్రకృతిధర్మాన్ని ధిక్కరించి
కొందరు తమ పాపపంకిల జీవితాల్లోకి
దుష్టనికృష్ట "ఎయిడ్స్" నామ మాయావిని
ఆహ్వానించి ఆశ్రయం ఇస్తున్నారు
దాని భీకర క్షుధాగ్నికి వారే
బలై పోతున్నారు
తెలిసో తెలియకో వారు పోషిస్తున్న
ఈ ఘోర వికార క్రూర దుర్వారాంధకారం
నిర్దోషులనుకూడ
నిర్దాక్షిణ్యంగా మింగేస్తున్నది
పాపమెరుగని పసివాళ్లను

యువతీ యువకులను
అమాయకులైన సతీపతులను
ప్రేయసీ ప్రియులను
విశుద్ధాత్ములైన వయోధికులను
మోసగించి
నిప్పులాంటి వారి బ్రతుకులకు
ముప్పుతెచ్చి పెడుతున్నది-

ప్రకృతి నియమాలను
పవిత్ర ఋతుధర్మాలను
పాటించే పశువులు, పక్షులు
రోగభయంలేని సంభోగం
చావు భయంలేని సంపర్కం
అనుభవిస్తున్న సహజసుందర సుఖజీవులు.
అనంత జీవకోటిలో
విజ్ఞాన ప్రజ్ఞాన మేధాశక్తిలో
అగ్రేసరుడైన మానవుడు
పావనప్రకృతి ధర్మోల్లంఘనం చేసి
వావి వరుసలు లేని
అక్రమ వక్ర మైథునక్రియలతో
వైద్యవిద్యకు పట్టుపడని
వ్యాధిగ్రస్తు డౌవుతున్నాడు

దివ్యమైన జననేంద్రియాలను
మరణేంద్రియాలుగా మారుస్తున్నాడు.

" ఏడ్సు - హెచ్ అయివీ" రోగి రక్తదానం
తీస్తుంది స్వీకర్త ప్రాణం
ఆ రోగరక్తం చవిచూచిన సూది
అంటినవారందరిని చేస్తుంది బూది
ఏడ్సు రక్తసిక్త సూదిస్పర్శ
తిరుగులేని మృత్యుసంతకం
పరలోకానికి దారిచూపే బాణసంకేతం
మాటలురాని పక్షుల్ని ఆదర్శం చేసికొని
ప్రకృతి నియతి ఋతుధర్మపథంలో
దాంపత్యాన్ని పవిత్ర పాతివ్రత్యంగా
ఏకపత్నీవ్రతంగా ఆచరిద్దాం
జార చోర శృంగారాన్ని బహిష్కరిద్దాం
నీతిలేని రతిని మానవజాతి జీవనంనుంచి
వెలివేద్దాం
" ఏడ్సు" మారి బుసకొట్టే విషపు కోరలనుండి
ఆబాలగోపాలాన్ని రక్షిద్దాం

# అరుణోదయం

కోళ్లగూళ్లల్లో
ఉదయాలు కూస్తున్నాయి
గాండ్రుకప్పల బావుల్లో
వానమబ్బులు లేస్తున్నాయి
మ్రోడుబారిన చెట్లగుండెల్లో
వసంతాలు మొలుస్తున్నాయి
పసిపాపల కనులకొలనుల్లో
కలల కలువలు పూస్తున్నాయి
లెక్కలేని చుక్కల గాయాలతో
బిక్కుబిక్కుమన్న ఆకాశం
చీకటిమీద తిరుగ బడుతూంటే
పీడితుల వేడి నిట్టూర్పుల్లో
విప్లవాలు వెలుగుతున్నాయి -

దిక్కుతెలియక కారడవుల్లో
చిక్కుకున్న కాలపు కళ్లు
సంకటాల కంటకాలు లేని
సత్యమార్గం వెదుకుతున్నాయి
స్వార్థం గతికి వేయలేని
కాంతిధారలు పితుకుతున్నాయి

# మృత్యుంజయులు

ఓ కర్కశ కరాళ మృత్యువా!
నీ ప్రాణాపహరణ పథకానికి
నియమ నిబంధనలు లేవా?
దయాదాక్షిణ్యాలు ఉచితానుచితాలు లేవా?
ఒక వేళనీ, ఒక చోటనీ
ఒక సందర్భం అనే నియమం లేకుండా
చేతికి చిక్కిన జీవుల్ని
చిత్రచిత్రంగా తినేస్తున్నావు
పుట్టిన ప్రాణులన్నిటినీ
నీ పొట్టలో పెట్టుకుంటున్నావు
మరి మా సానోబర్ - నౌషీరు యువదంపతులు
ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలిద్దరితో
అందరూ వెళ్లే పూనా హైవేమీద
అలవోకగా ప్రయాణిస్తుంటే
నలుగురినీ ఒక్క క్షణంలో
నలిపేసి మింగేశావు -

నీ మెడలో వేసుకోవడానికి
నీ జడలో ముడుచుకోవడానికి

ఏ పాపమెరుగని
ఆ పసిపాపలే కావలసి వచ్చిందా?
ఒకరికోసం ఒకరు పుట్టిన
ఆ యువదంపతులే దొరికారా?

కవితలో స్నానమాడి
కవితే దుస్తులుగా ధరించి
ఆహారంగా సేవించి
కవితలో సంభాషించి పరవశించిన
కుల మతాతీత మానవతాప్రతీకలు వారు
వారు పుట్టి పెరిగిన భాగ్యనగరం
వారు ప్రేమించిన హైదరాబాదు కవితాసమితి
వారి సుగుణసుమాలతో గుబాళించాయి
ఎందరి నోటనో కవితలు పలికించిన
ఆ సుందర సాహిత్యశోభాదంపతులు
ఓ మృత్యువా
నీమాయాజాలంలో చితికిపోయి
కవుల గుండెల్లో కన్నీటి కవితలైనారు
వాడిపోడి స్మృతుల వసంతాలైపోయారు.

# రాజకీయ పంచాంగం

గున్నమావుల నిట్టూర్పుల్లో
పంచమస్వరాలు పండించే
వసంతాలు
ఆశల కొండల్లో
ఆదర్శాల అడవుల్లో
చిక్కుకున్న 'యువశక్తి' ఊహలముందు
భయానక భవిష్యత్తును ఝుళిపిస్తున్నవి -

మోడుబారిన చెట్లకొమ్మలకు
చివుళ్ల తొడిగి, పూలు ముడిచి
చైతన్యడోలల్లో ఊగించే
చైత్రోదయిని
ఉన్న ఆకులు ఊడగొట్టే
శైశిరావేశంతో
మొండిబ్రతుకు మ్రాకులకు
ఆకులు కాదు బాకులందిస్తున్నది
పువ్వులు కాదు
తుపాకి రవ్వలు అతికిస్తున్నది
సంస్కరణం కాదు
సంహరణం బోధిస్తున్నది
పిట్టకూతలు కాదు

పిడుగుపాట్లు నేర్పిస్తున్నది.
వేప చేదును, బెల్లం తీపిని
చింతపులుసును చేరదీసి
ఒగరు తీరిన మామిడికాయ ముక్కలతో
ముచ్చటగా పచ్చడి చేసి
మానవ జీవితాన్ని వ్యజించిన
ఉగాది లక్ష్మి
కూడిఉన్న రుచులను ఊడతీసి
కలిసి బ్రతికే పక్షులకు
కక్షలు నూరిపోసి
చరిత్ర వాస్తవాలను
వక్రార్థాలతో వ్యాఖ్యానిస్తున్నది -

ఆశలు చావకుండా
అర్థమయి కాకుండా
పంచాంగ పఠనం చేసే
క్రొత్త సంవత్సరం
ఈసారి బల్లగుద్ది చెపుతున్నది
భవిష్యత్తు తనకు తెలియదని
కల్లబొల్లి కబుర్లుచెప్పే కాలాన్ని
కళ్లుమూసుకొని నమ్మొద్దని
బల్లగుద్ది చెపుతున్నది
రచ్చబండ సాక్షిగా
రాజకీయం నడుపుతున్నది

# అనంత క్షణం

నన్ను తీసుకవెళ్లడానికి
ఎన్నాళ్లుగానో ఆకాశంలో ఎగసివచ్చిన
విమానం
ఇప్పుడు నా బ్రతుకుముంగిట్లో దిగుతూంది
రాదేమోనని భ్రమపడ్డ రథం
రానే వచ్చింది
ఎవరు పంపించారో
ఎక్కడకి తీసుకవెళుతుందో
అక్కడికి చేరుకుంటేగాని తెలియదేమో!
ఆగమంటే ఆగే వాహనం కాదు
సాగమంటే సాగే యాత్ర కాదు
రథికుడులేని రథం
పథంలేని ప్రయాణం -

నేలమీద దిగిన రెక్కలపక్షి
నింగిలోకి ఎగసిపోతూంది
అరెరే !
వచ్చింది పక్షికాదు పక్షాలు
విమానంలా భాసించిన పక్షి
నాకు రెక్కలు తొడిగి వెళ్లిపోతూంది
వెళ్లిపోతుందనుకుంటున్న వింతపక్షి
నేనే అయిపోతూంది -

విమానం ప్రయాణం
రథం పథం
నింగి నేల, కాలం వేగం
అన్నీ నేనే అయిపోతున్న
అనిర్వచనీయానుభూతి
దేహాత్మలు కలిసి పాడే
అద్వైత రాగగీతి
చీకట్లన్ని హరిస్తున్న
ఏకైక పరంజ్యోతి
గతాగతాల భరిస్తున్న
నీలానంత కాలద్యుతి

# సెలవు తీసుకోని శిశిరం

ఇటుకల్నీ, కంకరనూ
అక్షరాలు చేసి
ఇసుకనూ సిమెంటునూ
కన్నీటిలో తడిపి
ఇనుపచీకుల ఛందస్సులో
అన్నిటినీ కలిపి
కవితలమేడలు కడుతున్నావా
కారడవుల్లో - ఎండు టెడారుల్లో
కుమిలిపోతున్న గుండెల్లో
చితికిపోతున్న బ్రతుకుల్లో -

అయితే,
ఆశలు ఆడుకోవలసిన గదిలో
నిరాశలు నిట్టూరుస్తున్నాయి
కలలు మేల్కోవలసిన శయ్యలమీద
వాస్తవాలు మూర్ఛపోతున్నాయి
కొండలు, నీ కృతులు చూచి
గుండెలు బాదుకుంటున్నాయి
కోనలు నీ ఆకృతులు చూచి

పులివో పిల్లివో
మనిషివో మర్కటానివో తెలియక
బావురుమని ఆవులిస్తున్నాయి
కొసరి పాడే కోకిలలూ
మిసమిసలాడే పుష్పవాటికలూ లేని
అకాల వికార వసంతాలు
ఎండమావుల్ని గండూషిస్తున్నాయి
అవును
పూలమేడల్లో పులకలెత్తే మత్తకోకిలలు
గాలివాడల్లో ప్రాణభిక్షాగానం
వినిపిస్తున్నాయి
మ్రోడుబారిన యువవృక్షాలకు
రంగు రంగుల రెక్కలెన్ని తొడిగినా
ఎండదెబ్బ తిన్న వాసంతం
గుండెనిబ్బరం కోల్పోయి
పండుగ చేసుకోనంటున్నది
స్వార్థపరత్వాన్ని, సంకుచితత్వాన్ని
స్వంతం చేసుకున్న శిశిరం
సెలవు తీసుకోనంటున్నది

# సారోపనిషత్

సారాను నిషేధించండి!
నారీజన నినాదం
తాగడం మాన్పించండి!
తత్త్వజ్ఞుల సందేశం
ప్రభుత్వజ్ఞుల ఆదేశం
తాగడం పోతే సారా పోతుందో
సారా పోతే తాగడం పోతుందో
తేల్చే పరమహంస లెవరో
తెలిపే సత్యవ్రతు లెవరో -

తాగడం మంచిది కాదని
తాగినవాళ్ళూ చెపుతారు
తాగడానికి వేయి కారణాలుకూడా
తర్కించి చూపుతారు -

"మాన్పించగలిగేదైతే
మహాత్ముల ప్రయత్నం
ఫలించకపోవునా?
నిషేధించగలిగేదైతే
ప్రభుత్వ శాసనాలు జయించకపోవునా?

సందేహంలో సమాధానం
రంగరించి చెపుతారు-
ఇంతకీ మద్యంమీద ఉద్యమం లేపిన
మహిళామణులను
సారాను ఘెరావు చేసిన
సారసాక్షులను
త్రాగనివాళ్లూ త్రాగేవాళ్లు
బహిరంగంలో మెచ్చుకుంటున్నారు
అంతరంగంలో నొచ్చుకుంటున్నారు
మెచ్చుకొనేవాళ్లెవరో
నొచ్చుకొనే వాళ్లెవరో
తెలియకవచ్చే పిచ్చివాణ్ణి నేను.

# కాలాన్ని కన్నతల్లి

కాలం ఒక వింత శిశువు
వెచ్చనిగాలిపెట్టే చక్కిలిగింతలకు
నవ్వుల పువ్వులు పూస్తుంది
నింగిలో తేలియాడే మబ్బుల్ని పిసికి
మట్టిలో పారేస్తుంది
తనకో ఇల్లూ వాకిలీ కావాలని లేదు
ఆటపాటలుంటే చాలు
అంతా తనదే అనుకుంటుంది
తాను కట్టుకున్న పిచ్చుకగూళ్లను
తానే చెరిపేసి వినోదిస్తుంది
చేతికి దొరికిం దేదైనా, దానితో
కాసేపు ఆడుకుంటూ ఆనందిస్తుంది
ఎవరు చెప్పినా వినకుండా
ఏ హేతువుకు కట్టుబడకుండా
ఏదైనాసరే పారేస్తుంది తగలేస్తుంది
పర్యవసానం ఏమైనా
పట్టించుకోకుండా వెళ్లిపోతుంది
కల్లా కపటంలేని ఈ కాలశిశువును చూస్తే
అందరికీ భక్తే అందరికీ భయమే
కష్ట సుఖాలెరుగని కాలశిశువుకు
కన్నతల్లి ఎవరోకాని
ఓ దేశమంటూ భాషంటూ లేని
అనాధను చేసి
కులాసాగా వెళ్లిపోయినట్లుంది
విలాసం లేనిచోటుకి

# సత్యహేల

మతాన్ని సృష్టించలేదు దేవుడు
కులాన్ని పుట్టించలేదు దేవుడు
దేవుడు సృష్టించింది
మనిషినీ మమతనూ -

దేశాలు పుట్టనినాడు పుట్టాడు మనిషి
భాషలు పుట్టనినాడు పుట్టింది మమత-

అసలు దేవుడు ఒక్కడే
అండ పిండ బ్రహ్మాండాల అంతటా నిండిన
ఆదిదేవుడు ఒక్కడే
ప్రతి మనిషీ దేవుని ప్రతిరూపమే
ప్రతి వ్యక్తీ ఏకైక మూలశక్తి దీపమే
అంటూ చాటిన సత్యమే మతం
సత్యం దేవుడైతే
చాటింపు మతం అయింది -

మానవత్వాన్ని నిర్వచించే
మమతలే మతాలు

మనిషిని దేవుణ్ణి చేసే
మార్గాలే మతాలు
పేరులేని ఒకే ఒక దైవానికి
పేర్లు పెట్టాయి భాషలు
అవధిలేని అనంతసత్యానికి
హద్దులు పెట్టాయి మతాలు
అయితే
ఏ పేరున పిలిచినా,
ఏ తీరున కొలచినా
అందరి దేవుడూ ఉన్న ఆకాశం ఒకటే
అన్ని మతాలకు ఉన్న ఆధారం ఒకటే
మతాలైనా హితాలైనా
వేదాంతాలైనా విజ్ఞానాలైనా
మనిషికీ దేవునికీ ఒకే
మాతృభాష బోధించాలి
సాకార నిరాకారాలను,
సగుణ నిర్గుణాలను
సమన్వయపరిచే
సమతాసత్యాన్నే ప్రవచించాలి

# తిమిరావళి

అసత్యరథారూఢుడై
అంధకారాసురుడు
కనిపిస్తే చాలు
వెలుతురుగొంతుకల్ని త్రెంచేస్తున్నాడు
కాంతికంత విలుంఠనయాత్ర
తన కన్నులపండువగా జరుపుకుంటున్నాడు
ప్రగతిపాఠాలు వల్లిస్తున్న
ప్రజాప్రహ్లాదుణ్ణి
దీపం పేరు చెప్పడమే
పాపం అని హెచ్చరిస్తున్నాడు
దరిద్రనారాయణుణ్ణి తలిస్తే
దండనం తప్పదని ప్రకటించాడు
చీకటికి తెలియని విద్యలు
లోకంలో లేవంటున్నాడు
చీకటి వేయలేని వేషం
సృష్టిలో లేదంటున్నాడు
శాస్త్రాలన్నీ చదువుకున్న రాక్షసులు
సంరక్షించే చీకట్లకు

చావుభయం లేదంటున్నాడు
గిట్టనిదానినల్లా 'చీకటి' అని
తిట్టే మనస్తత్వం తిరోగమనమట
వాదాలన్నీ తమస్వినిముందు
తలవంచక తప్పదట
దిక్కులేని దీపావళికంటే
చెక్కుచెదరని తిమిరావళి
చేసుకొనే పండుగే పండుగట
అయితే,
అంధకారాసురుని
స్తంభించిన దురహంకారస్తంభంనుంచి
జృంభించి వస్తుంది
విక్రాంత కాంతిసింహం
కోటికోటి గోటి దీపాలతో
నేటి మేటి చీకటిగర్భగోళాన్ని
చీల్చి కాల్చివేస్తుంది
అంటూ
చరిత్రగాత్రం వినిపిస్తోంది
పవిత్రధర్మ విప్లవగీతం
ఆశాభానుకిరణావేశ సంగీతం.

# కుకవీశ్వరుడు

ఆత్మలేని శరీరంలా
సత్యంలేని నీ కవితాకళేబరం
క్రుళ్లి కంపుకొడుతూంది
సత్యాన్ని సుందరంగా శబ్దీకరించే
శివంకరుడే కవి
మరి నీవో?
అర్థంలేని అయోమయత్వాన్ని
స్వాదుశబ్దాల గొంతుకులకు బిగించి
సత్యాన్ని హత్య చేస్తున్నావు
చట్టాలకు చిక్కని చాకచక్యంతో
స్వార్థాన్ని సాధిస్తున్నావు

కాలానికి దారిచూపేది కవిత
కళ్లకు గంతలుకట్టేది కాదు
నిశ్శబ్దాన్ని శ్రుతిచేసేది శబ్దం
భావతంత్రుల్ని త్రుంచేది కాదు
రసానందనేత్రం కావ్యం
విషమ్ముషాబంధ సూత్రం కాదు-

నిజం చెప్పలేని నీ పిరికితనాన్ని
వృథాలంకారాలతో కప్పిపుచ్చకు!
పాపభీతిలేని నీ కపటాన్ని
ప్రగతినాదాలుగా వల్లించకు
త్రికరణశుద్ధి లేని నీ బుద్ధిని
చీకటిబజారులో విక్రయించకు
ఓ కు-కవీశ్వరా
నీ అఖండ కీర్తి కామేష్టికోసం
సత్య సాహిత్య సరస్వతిని
చిత్రహింసలు పెట్టకు

# కోహం అనలేని అహం

అహంభావం
గండశిలలై, పీడకలలై
సత్యం గుండెమీద తిష్ఠవేసింది
నా, నేను, నాది
నాకే, నేనే, నాదేవంటి
స్వార్థపర శబ్దాలంకార భాష
అహంకారాసురఘోష
శివ సత్య సుందర మందిరంలో
విలయనాట్యం చేస్తూంది
నీ, నీవు, నీకుకూడా అనలేని
సంకుచిత తత్వ వ్యాకరణం
త్రికరణాలను నడిపిస్తూంది.

అహంకారం ఒక నల్లమందు
దాని మాయమత్తులో పడితే
మనిషికి మతిపోతుంది
మంచి - చెడులను గుర్తించే
మానవత్వం నశిస్తుంది
చావుపుట్టుకల గురించి

శాంతిసూత్రాల గురించి
నీతి నియమాల గురించి
అహంకారాచారి చేసే బోధ
చాటే సమతాద్వైతం
" కర్త నేను కర్మ నీవు
కష్టం నీది ఫలితం నాది" అనే
సానుభూతిలేని ద్వైతం
సత్యాన్ని హత్యజేసే ప్రయత్నం -

దేహం వ్యామోహంలో పడి
"కోహం" అనలేని అహం
సోహం అనగలిగేదెపుడో?
త్వమేవాహంగా
మనగలిగేదెపుడో?

# తారుమారు

ఒకప్పుడు
చీకటికి వెలుతురు
బుద్ధి చెప్పేది
ఇప్పుడు,
వెలుతురుకే చీకటి
విద్య నేర్పిస్తూంది
అప్పుడు
త్యాగం స్వార్థాన్ని ఖండించేది
ఇప్పుడు
స్వార్థమే త్యాగాన్ని దండిస్తున్నది
అప్పుడు
పేరుకు ఉన్న కులం పోవాలన్నారు
ఇప్పుడు
కులానికి
లేని పేరు కావాలంటున్నారు
అప్పుడు
అవినీతికూడా నీతిగా మెలిగేది
ఇప్పుడు
నీతియే అవినీతిగా వెలుగుతూంది

అప్పుడు రాజకీయాన్నికూడా
కవిత్వం చేసిన కోకిలత్వం విరిసేది
ఇప్పుడు కవిత్వాన్నికూడా
రాజకీయం చేస్తున్న కాకితత్వం మెరుస్తోంది
అప్పుడు స్త్రీలకు చదువు లేదు
కాని స్వాతంత్ర్యం ఉండేది
ఇప్పుడు చదువుకున్న మహిళామణులకు
స్వాతంత్ర్యం లేదు కాని
లేదని ఏడ్చే స్వాతంత్ర్యం ఉంది-

అప్పుడు
యువకవులు ప్రసిద్ధకవులను
పట్టి పట్టి అనుకరించేవారు
ఇప్పుడు
ఆరిపోతున్న మహాకవులు
పేరుకోసం
ప్రచారకవులను అనుసరిస్తున్నారు.

# క్రొత్త పల్లవి పల్లవాలు

శిశిరభయం లేని వసంతం వస్తుందని
చెట్లు
క్రొత్త కోకిల పాటలకు
పల్లవులు రచిస్తున్నాయి
దగా చేసే ద్వంద్వార్థాలు లేని
స్వాదుశీల భాషలో -
సత్యాన్ని చాటే పాటలకు
పల్లవి పల్లవాలు కూరుస్తున్నాయి
ఋతుగతులు గ్రహించే
చెట్లకొమ్మలు

విలయతాండవంచేసిన శిశిరాన్ని
తరిమివేసిన
వీర మరుద్వీచికలకు
స్వాగతం పలుకుతున్నాయి
రంగురంగుల బావుటాలతో
విజయావేశ పుష్పాలు
గర్వానంద బాష్పాలు -

చీకటి అడవి కడుపులో రేగిన
ఆకటి సింహగర్జన విని
వేకువ దూసుకొని వస్తున్నది
విప్లవ కాంతి తీరంనుంచి
మార్పు తూర్పు ద్వారంనుంచి-

విలాసాల మోసాలకు చిక్కని
పలాశ కుసుమ హాసాలు
పవిత్ర త్యాగధునీ తరంగాలు
నడిపిస్తున్నాయి
తేజోమయ గేయ చరణాలను
అవక్ర విక్రమ ధర్మచక్రాలను
అభయారణ్య దీప్తస్వరాలను -

క్రొత్త సత్యాలను చూడలేని
పాత విశ్వాసాలను వీడలేని
మనస్తత్వానికి
మధుమాసం అంటే భయం -
విశ్వాసాలు మారందే
విలువలు మారవు
విలువలు మారందే
చీకటిబ్రతుల్లో వెలుగులు పూయవు
విలువలు మార్చుకోలేని విస్పన్నలకు
విప్లవాలంటే భయం
భయంలేని విప్లవ వాసంతాలకు
స్వార్థంలేని కలకంఠాలు
స్వాగతం పలుకుతున్నవి
స్వేచ్ఛయే ఊపిరియైన
చిరుగాలుల శీర్షాలమీద
అభినందన గంధాలు చిలుకుతున్నవి

# గ్రంథాలయ గోపురాలు

అక్షరాకాశంలో పొడిచిన
తొలిప్రొద్దు పుస్తకం
శబ్దసరోవరంలో విరిసిన
తొలి శతపత్రం పుస్తకం-

శిలలమీద శ్రీకారం దిద్దిన అక్షరం
ఆకులమీద ఆకారం దాల్చిన శబ్దం
తమ విశ్వరూపాన్ని ప్రదర్శిస్తున్నవి
అంతరిక్షాన్ని జయిస్తున్నవి
గ్రంథాలయ గోపురాలనుంచి
ఆలోచనల కాపురాలనుంచి
అవనీగోళాన్ని పాలిస్తున్నవి -

చేతిలో పుస్తకం లేకుండా
క్షణమైనా బ్రతకలేదు సరస్వతి
ఏ వేదమైనా వాదమైనా
గ్రంథస్థం కాకుండా గుర్తింపు పొందలేదు -

విజ్ఞానాన్ని పెంచేవి గ్రంథాలే
వివరాలు అందించేవి గ్రంథాలే
విప్లవాలు తెచ్చేవి గ్రంథాలే
విభేదాలు తీర్చేవి గ్రంథాలే
ప్రశ్నలు వేసేవి పుస్తకాలే
సమాధానాలు రాసేవి పుస్తకాలే
ధర్మాలు బోధించేవి పుస్తకాలే
మస్తకాలను వేధించేవి పుస్తకాలే -

దరిద్రులనీ ధనవంతులనీ విభేదాలు లేని
కుల మత వర్గ వివక్షలేని
అక్షర చక్షువులు గ్రంథాలు
సమదర్శన సాధనాలు గ్రంథాలయాలు
పుస్తకాలకు నిదురలేదు
రేయింబవళ్లు రెక్కలార్చే పక్షులవి
లోకం నిద్రిస్తున్నా
గ్రంథాలు మేల్కొనే ఉంటాయి
కలాలు పట్టుకొని
కాలం పోకడలు కనిపెడుతూనే ఉంటాయి
పుస్తకాలలోని భాషలు వేరైనా
భావాలు పంచుకుంటాయి
నదులన్నీ సాగరం చేరినట్లే
పుస్తకాలన్నీ గ్రంథాలయం చేరుకుంటాయి
సముద్రాలనుంచి మేఘాలు పుట్టినట్లే
గ్రంథాలయాలనుంచే
గ్రంథాలు పుడుతుంటాయి
భూత భవిష్యత్ వర్తమానాలకు
అనుబంధాలు కలుపుతుంటాయి
పుస్తకాలు పరస్పరం
మాట్లాడుకుంటాయి - పోట్లాడుకుంటాయి
పొత్తు కుదిరినా కుదరకపోయినా
సహజీవనం చేసే సూత్రాలు పొత్తాలు
అలసటలేని జీవనయాత్రలో
అనంతసత్యాలు శోధించే
పుణ్యక్షేత్రాలు గ్రంథాలయాలు

# కారణజన్ముడు సంజీవయ్య

స్తంభించిన కులతత్వ స్తంభం చీల్చుక
జృంభించిన మానవత్వం - సంజీవయ్య!
సత్యాన్ని హత్య చేయాలనుకున్న
స్వార్థపర రాక్షసత్వాన్ని
తన కొనగోటితో చీల్చివేసిన
సింహబలుడు - త్యాగధనుడు - సంజీవయ్య!
దరిద్ర నారాయణునికోసం
తపించిన ప్రజాస్వామ్య ప్రహ్లాదునికి
అభయమిచ్చిన దామోదరుడు - సంజీవయ్య!
జర్జర దళిత జీవితాలకు
జీవం పోసిన
గర్జాగళ పర్జన్యం - సంజీవయ్య!
మనిషికి అస్పృశ్యతను పులిమిన
మలినాత్ములకు
వేదభూమిలో వర్ణభేద బీజాలు నాటిన
దురాత్ములకు
సమతాదర్శం బోధించిన
ప్రగతిశీలి - ప్రజ్ఞాశాలి - సంజీవయ్య!
కర్నూలు మండలంలో పుట్టిన
కారణజన్ము డాయన

పెదపాడు గూటిలో పాటనేర్చిన ఆ పిట్టపిల్ల
తెలుగునాడు వాటిలో
శాంతి విప్లవ వసంతాలు వెలిగించింది
నిశాంత కోకిలయై
దిశాంత యశోగానమై!

సంజీవయ్యకు
జననం తప్ప మరణం లేదు
జయంతులు తప్ప వర్ధంతులు లేవు
దరిద్రులను మేల్కొలిపిన నిర్నిద్రుడు
బలహీనుల పాలిటి బలభద్రుడు - రుద్రుడు ఆయన!
భరతమాత కంఠంలో
తెలుగు తల్లి వేసిన
అమ్లాన మల్లికామాల
సంజీవోజ్జ్వల జ్వాల -

రాజనీతికి జ్ఞానజ్యోతికి
మారుపేరైన రాజాజీయే
రచించిన జాతకచక్రం ఆయనది
దేశచరిత్రకే స్వర్ణాక్షరాలు సమకూర్చిన
జీవితచరిత్ర ఆయనది -

గొంతెత్తి, హృద్యంగా
ఆయన తెలుగు పద్యాలు పాడుతుంటే
కృష్ణ వేణి తల ఊపుతూ తిలకించేది
గోదావరి గుండె పులకించేది
ఆయన కళ్లల్లో రాయలసీమ
కలలు కనేది
అతని చేతుల్లో
తెలంగాణ పరవశించేది
ఆయన నవ్వుల్లో తెలుగుతీరం
పరిమళించేది
ఢిల్లీకి పల్లెల నివేదన
పల్లెలకు ఢిల్లీ వేదన
వినిపించేది ఆయన దేశభక్తి
ఆయన త్రికరణశుద్ధికి
అంజలి ఘటించేది
భారతదేశ ప్రజాశక్తి -

# గగనాంగ నాంగుళీయం

సూర్యచంద్రులు చోద్యంగా
మసకచీకటి ముసుగు వేసుకొని
స్నేహాలింగనం చేసుకున్నప్పుడు
త్వమేవాహంగా
అద్వైతసిద్ధి పొందినప్పుడు
భారతాకాశ లక్ష్మి పొందిన
దివ్య భావరసానుభూతిని
దేశ కాల చరిత్ర పుటల్లో
వ్రాసిపెట్టడానికి
సాచిన తన కేలు వ్రేలుపై
అవర్ణనీయ వజ్ర ఖచిత
సువర్ణాంగుళీయం
అక్షరాలా మెరిసింది -
పగలే నక్షత్రాలు మేల్కొని
ధగ ధగ మెరిసే చూపులతో
సత్యానుభూతి పత్రాలమీద
సాక్షి సంతకాలు చేసినవి -

భూగోళ జీవితంలో
ఖగోళం పండించిన మరో కలగా

అంతరిక్ష వృక్షంమీద
విరిసిన వింత పుష్పం అది
దేవునికి జీవునికి మధ్య
కాలం కట్టిన భ్రాంతి యవనికమీద
కనిపించిన వాస్తవకాంతిచిత్రం అది
అజ్ఞాన శోకవనిలో
అహంకారాసురిని చెరలో
అలమటించే సీతాభూమాతకు
అనంత శక్తి హనుమాన్
అందించిన
శ్రీరామ రక్షాంగుళీయంలా ఉంది అది -
విజ్ఞాన ప్రజ్ఞాన పారంగతులు
జిజ్ఞాసచక్షువులో
వీక్షించిన ఆ సన్నివేశం
ఆబాలగోపాలాన్ని అలరించిన
ఆ అద్భుతావహ దృశ్యం
మళ్లీ దర్శించేదెన్నడో అని
మానవ లోకం నిట్టూర్చింది
తాను సాధించిన సౌరమండల విలాసానికి
ఈ శతాబ్దం గర్వించింది
(24-10-1995 నాటి సంపూర్ణ సూర్యగ్రహ విలాసం)

# కాలం పట్టిన కరదీపం రంగా

పుట్టినతీ రందరిదీ ఒకటే
గిట్టినవా రందరి దారొకటే
కాని,
జీవించినవా రందరి తీరు
అందరి దారి ఒకటి కాదు
అందుకే,
" పురుషులందు పుణ్య పురుషులు వేరయా"
అన్నాడు వేమన్న
ఆచార్య రంగావంటి
అరుదైన పురుషార్థుల్ని చూచి
ప్రవచించి ఉంటాడు వేమనకవి
ఈ పుణ్య పురుషవేదం -

ఇరవయ్యో శతాబ్దం నిండా
విస్తరించిన రంగా జీవితపు
దారి వేరు తీరు వేరు
మట్టిని నమ్ముకున్న రైతుల కోసం
పుట్టిన కారణజన్ము డాయన
దేవుణ్ణి నమ్మనివారుకూడా
నమ్ముకున్న దేవు డాయన
రంగా జీవితసత్యాలను
రమ్యాక్షర చరిత్ర చేసిన వీరన్న
రంగనాయకుని అంతరంగాన్ని
కవితాచిత్రం గీసిన ఈ బాపన్న
రంగాపట్ల తెలుగువారి కృతజ్ఞతకు
చెరగని సజీవ సాక్షి సంతకాలు -

ఆలస్యమైనా అమృతంగానే నిలిచే
ఆలోచన అతనిది
చర్వితచర్వణం కాని
సమాజ సేవా వ్రతం అతనిది

గమ్యంచేర్చే మార్గం వెదకిన
కార్యశూరుడు రంగా
మార్గంకోసం గమ్యం మార్చని
త్యాగవీరుడు రంగా
పార్లమెంటులో మాట్లాడినా
పల్లెసీమలో మాట్లాడినా
ప్రజాకోటి ప్రగతి జీవన
బాష్యకారుడు రంగా

నిరంకుశత్వం - అరాచకత్వం
పాశవికత్వం - దోపిడితత్వం
ఏ రూపంలో చెలరేగినా
ఎదిరించిన ఘను డాతడు
భారతదేశ భక్తికి
తెలుగుగంధం పూసిన
అనఘు డాతడు -

త్రికరణశుద్ధి కుంచెతో
ఖద్దరు పంచెతో
భారతీయాత్మను దర్శించిన గాంధేయు డాయన
మానవతను పూజించిన విశ్వమానవు డాయన
కదలిపోతున్న కాలం చేతిలో
ఆరిపోని అమరదీపం ఆయన

# స్వార్థతంత్ర దేశం

నేటి భారతదేశం
సర్వ స్వతంత్రమైంది
ఎవరికి తోచింది వారు
స్వేచ్ఛగా చేసుకోవచ్చు
“సర్వ ధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణంవ్రజ” అంటూ
“స్వార్థం” పరమార్థాన్ని బోధిస్తున్నది
“స్వార్థం శరణం గచ్ఛామి” అంటూ
పైశాచిక ధర్మం ప్రతిస్పందిస్తున్నది
ఎవరిస్వార్థం వారు చూచుకోవటం
ఈనాడు
అందరి కనీస ఉమ్మడి కార్యక్రమం -

ఇప్పుడీ దేశాన్ని వర్ణించటం
ఏ కవికీ సాధ్యం కాదు
ఈనాటి సమాజాన్ని విశ్లేషించడం
ఏ మేధావి తరం కాదు
భరతజాతి జాతకం చెప్పగలిగే
జ్యోతిష్కుడు కనిపించటం లేదు
కార్యకారణ సంబంధాలు
కనుక్కోలేక
హేతువాదం నోరుమూసుకుంది

ఏ సూత్రాలకూ కట్టుబడని
మన సాంఘిక ఆర్థిక వ్యవస్థ
పోయిందే దారిగా
చేరిందే గమ్యంగా
సరిపెట్టుకుంటున్నది
చట్టాలనూ సంస్కరణలనూ
సవాలు చేస్తున్న స్వార్థం
ప్రభుత్వాంగాలన్నిటిమీద
పట్టు సాధిస్తున్నది
రాజ్యాంగానికికూడా చిక్కని
రహస్యాలు శోధిస్తున్నది
చరాచర చిరాచిర జగత్తును
ఏకానేక కామరూపిణి
స్వార్థం శాసిస్తున్నది
దళిత వాదానికి, స్త్రీ వాదానికి
శిథిలమౌతున్న సామ్య వాదానికి
అవకాశ వాదం నేర్పిస్తున్నది
దురిత కళాకోవిద స్వార్థం -

అస్తినాస్తి వివాదగ్రస్త
న్యాయాన్ని
శ్మశానంలోకూడా
సాధించలేకపోతున్న
సమానత్వాన్ని
పోషిస్తున్నది స్వార్థం -

శాశ్వతమైంది ఏదైనా ఉంటే
సర్వాంతర్యామికి అర్థం ఉంటే
అది
వేదోపనిషత్తులు వల్లించే
పరబ్రహ్మ పదార్థం కాదట
నిత్య సత్యమైన
"స్వార్థపరత్వం" ఒక్కటేనట -

"సంభవామి యుగే యుగే" అన్నవాడు
చాలించాడు అవతారాలెత్తడం
దుష్టులెవరో శిష్టులెవరో
తెలియనీయని
ద్వైతాద్వైత మిథ్యాతత్వాన్ని
మాయామయ అయోమయత్వాన్ని
సృష్టిస్తున్న "స్వార్థాసురత్వాన్ని"
అంతం చేయాలంటే
ఏ రూపం దాల్చి రావాలో
ఏ ఆయుధం కావాలో
బోధపడక బాధపడుతున్నాడు
భగవంతుడు!

# ప్రాశ్నికవాది ఈ ఉగాది

సమాధానాలు లేని
ప్రశ్నలపత్రం ఈ చైత్రం
సమాలోచనం లేని
సందేహాల చిత్రం ఈ చైత్రం
'కోహం? కోహం?' అంటూ
కోకిల వేస్తున్న ప్రశ్నకు
ప్రకృతి ఉలికిపడుతూంది
కాలం కలవరపడుతూంది-

మోడుబారిన చెట్లమీద మొలుస్తున్నాయి ప్రశ్నలు
తడిలేని పెదవులమీద తడబడుతున్నాయి ప్రశ్నలు
పువ్వులు రువ్వుతున్నాయి రంగురంగుల ప్రశ్నలు
పక్షులు కూస్తున్నాయి నోటికి వచ్చిన ప్రశ్నలు
అడవిలో తిరుగుతున్నాయి
ఆగ్రహోదగ్ర ప్రశ్నలు
వీధిలో మూల్గుతున్నాయి
దిక్కులేని ప్రశ్నలు
నింగిలో చుక్కల చూపుల ప్రశ్నలు
నేలమీద హక్కుల పిడికిలి ప్రశ్నలు
సమస్యల వలయంలో చిక్కుకున్న
పరిష్కారాల, కింకర్తవ్యం ప్రశ్నలు
ప్రశ్నలు! ప్రశ్నలు! ప్రశ్నలు!
ప్రజల జీవితాలన్నీ ప్రశ్నలు

పరీక్షలు పెడుతున్న ప్రశ్నలవిధాత ఈ ఉగాది
నేటి అస్తవ్యస్త సామాజిక వ్యవస్థతో
కుస్తీ పడుతున్న ప్రాశ్నికవాది ఈ ఉగాది
ప్రశ్నకు ప్రశ్నవేసే
పృచ్ఛకావధాని ఈ ఉగాది-

కృతజ్ఞతా పూర్వకంగా
డైరీలు వ్రాసుకున్న గుప్తవ్రాతలు
మార్చేస్తున్నాయి వీరాధివీరుల తలవ్రాతలు
పేర్చేస్తున్నాయి ప్రశ్నమీద ప్రశ్నలు !
పామరులు అడిగే ప్రాథమిక ప్రశ్నలకు
సమాధానాలు లేవంటున్నారు పండితులు
ఈ ఏడు ప్రచురించిన పంచాంగంలో
కలికాలపు రాజ్యాంగంలో -

అన్ని మతాల సారమొక్కటేనని
ఆమోదిస్తున్న బుద్ధిమంతులే
ఒకరినొకరు ఎందుకు చంపుకుంటున్నారో
బోధపడక బాధపడుతున్నాడు భగవంతుడు-
పిల్లలు లేవనెత్తే ప్రశ్నలకు జవాబులు చెప్పలేక
బెత్తాలు ఎత్తుతున్నారు బడిపంతుళ్లు
భక్తులు వేస్తున్న మౌలికప్రశ్నలకు
బదులు చెప్పలేని స్వాములు
తర్జన భర్జన గర్జనలు మాని
నిర్జన సీమల్లో వెదకుమంటున్నారు నిజానిజాలు -

పాలకుల్ని పిలుస్తున్నాయి ప్రజల ముంగిటికి ప్రశ్నలు
ఈ దేశం ఎవరిదని అడుగుతున్నాయి
పోటీపడుతున్న ప్రశ్నలు -

నేలను ప్రశ్నిస్తున్నాయి నాగళ్లు
గాలిని ప్రశ్నిస్తున్నాయి కొడవళ్లు
చెట్లను ప్రశ్నిస్తున్నాయి గొడ్డళ్లు
గట్లను ప్రశ్నిస్తున్నాయి సెలయేళ్లు
మౌనం వహిస్తున్నది జ్ఞానం
ప్రశ్నలే అర్థం కావటం లేదని
పరధ్యానంలో పడుతున్నది సమాధానం -

చీకటి ప్రసవిస్తున్న ప్రశ్నార్థకాలు
వేకువను విసిగిస్తున్నవి
గతాన్ని వదలనీయని పీడకలలు
భవిష్యత్తును భయపెడుతున్నవి
దళితవాదం, స్త్రీవాదం విసిరే సంశ్లిష్ట ప్రశ్నలు
సాహిత్యలోకంలో సంచలనం రేపుతున్నవి
కర్మక్షేత్రంలో దాగిన మర్మసత్యాలను
ధర్మక్షేత్రం శోధిస్తున్నది
దుర్యోధన, దుష్ట శాసన దురాశా హస్తాలనుండి
విలువల వలువలు కాపాడమని
ప్రజావాణి విలపిస్తున్నది
ప్రశ్నలపచ్చడి చేస్తున్న ఈ పండగ నేమనాలి?
దివాలిని ఉగాదిని కబళించే
"హవాలి" అని అనాలా?

# మారని మత్సరం

మారలేదు నేస్తం
నీ వింకా మారలేదు
తరం మారిపోతున్నా
తమస్సు ఆరిపోతున్నా
నీ తెలివింకా తెలవారలేదు
లోకమంతా వెలుతురుకోసం
వెదుకుతుంటే
నీవుమాత్రం
చీకటికోసం ప్రాకులాడుతున్నావు
నీ చుట్టూ కట్టుకున్న
"అసూయ" అనే అడ్డుగోడలమీదినుంచి
సమత సాచిన స్నేహహస్తాన్ని
నరికివేసే నీ కర్కశత్వానికి
జ్ఞానోదయం అయ్యేదెప్పుడు?
నీ నీడనుచూచి నీవే భయపడుతూ
అది
సూర్యబింబం నీ వెంటాడించే
శత్రువని భ్రమపడుతూ
వెలుతురుమీద విరుచుకుపడే

వెర్రికుక్కవు నీవు
ఉపకారానికి అపకారం చేసే
గుంటనక్కవు నీవు
దోస్తీతో కుస్తీ పట్టే
కుహనాసంస్కృతి నీది
హోరెత్తి సాగరం నిన్ను పిలుస్తుంటే
బురదగుంటలో వినోదించే
పరమ మూర్ఖుడవు నీవు
స్వార్థం లేని వసంతాన్ని
అర్థం చేసుకోలేక
ఆత్మీయంగా పలికే కోకిల పిలుపును
అపార్థం చేసుకుంటున్న నీకు
నా మనోగతం ఎరిగించే
మౌనభాష నేర్చుకుంటున్నాను
నీ గుండెలో నిండిన విద్వేష విషాన్ని
వెలికి తీసి పారేసి
నీవూ నేనూ కలిసి
త్వమేవాహంగా వెలిగే
విద్య నేర్చుకుంటున్నాను
చెదిరిపోయిన విశ్వాసవిహంగాన్ని
నా చెంతకు చేర్చుకుంటున్నాను

# అనంతం అజ్ఞానం

ఈ మట్టిగోళాన్ని గిరగిరా త్రిప్పేది
ఎవరైనా
మనిషిమాత్రం కాదు
ఆ సూర్యగోళాన్ని భగభగా మండించేది
ఎవరైనా
మనిషిమాత్రం కాదు
చీకటిరాత్రి కళ్లల్లో చుక్కల్ని వెలిగించేది
ఎవరైనా
మనిషిమాత్రం కాదు
వచ్చిపోయే కాలాన్ని సృష్టించేది ఎవరైనా
మనిషిమాత్రం కాదు
ఇవన్నీ చేసేవాడొకడున్నాడనుకుంటే అది ఎవరైనా
మనకు తెలిసినవాడుమాత్రం కాదు
తెలియనివాణ్ణి ఏమని పిలిచినా
ఎలా తలచినా, కొలిచినా
అర్థంలేదని తెలియనిమనిషి
ఆత్మజ్ఞానం బోధిస్తాడు
అహం బ్రహ్మోస్మి, సోహం, త్వమేవాహం
అంటూ అన్నీ తెలిసినట్లు వాదిస్తాడు
అత డెవడో తెలియకపోయినా
"అతడే ఇతడు" అనే అనంత అజ్ఞానికి
అంతమెప్పుడో!

# లైంగికాభినయం

తెలుగు సినిమా పాటలు
తెరమీద ఆడే ఆటలను
ఇంగ్లీషు క్యాబరేలు
నైటుక్లబ్బుల నగ్నవిలాసాలుకూడా
చూడలేక సిగ్గుపడుతున్నాయి -

వాత్స్యాయన కామసూత్రాలకు
వక్రబాష్యాలు
నల్లడబ్బుకు అమ్ముడుపోతున్న
నాయికానాయకుల అభినయాలు
ఆంగికాభినయం పేర
లైంగికాభినయం
సాత్త్వికాభినయం పేర
తామసికాభినయం -

కుళ్లిపోయిన పలుకుల్లో
కంపుగొట్టే అర్థాలు నింపిన
చౌకబారు సాహిత్యం

గతిలేని మతిలేని
స్వరాల పీకులాట సంగీతం
తోపులాట, ఊపులాట నాట్యం -

విష సర్పాల్లా బుసకొట్టే
మానవాకృతులు
దిక్కుల డొక్కలు చీల్చే అసురారణ్య ఘీంకృతులు
భావానికి జీవంపోసే భాషను
రసాలు పండించే రాజహంసలను
వెన్నుపోటు పొడుస్తున్నాయి
మోటుమాటల ఈటెలతో -

పరమానందం కోసం
పరితపించిన
పంచేంద్రియాల ప్రాణం తీశారు
మనిషిని దేవుణ్ణి చేయాలని
కలలుగన్న కళలను
దానవులకు దానం చేశారు
తరతరాల తపస్సుతో సాధించిన సంస్కృతిని
క్షణికభోగాల అసభ్యవీధిలో
వేలం వేశారు

# ప్రమాదంలో ప్రగతిచక్రం

కాలానికి దారిచూపే
కవితకళ్లు కప్పేశారు
జీవితానికి అర్థంచెప్పే
కలలగొంతు నొక్కేశారు
దారిలేని ఎడారిలో కాలం విలపిస్తోంది
అర్థంలేని భాషలా బ్రతుకు ఆవులిస్తోంది
దివారాత్రాలు వచ్చి పోతున్నాయి
దిక్కులేని కుక్కల్లా
జీవితాలు కూలిపోతున్నాయి
రెక్కలులేని పక్షుల్లా
గతచరిత్ర తెలియని వర్తమానం
భవిష్యత్తుకు పాఠాలు చెపుతున్నది
అహంకారంతో క్రుళ్లిన అజ్ఞానం
ఆత్మజ్ఞానం బోధిస్తున్నది -

సంస్కరించవలసిన మనిషిని
సంహరిస్తున్న ఆవేశం
మనసులన్నిటిని కలిపే దైవాన్నే
ముక్కలు ముక్కలు చేస్తున్న విద్వేషం
సమస్త వాదాలను

సర్వోత్తమ వేదాలను
స్వార్థపు ఆస్థానంలో
విదూషకులుగా మార్చి వినోదిస్తున్నవి -

సత్యం, అహింస, శాంతి
నినాదాలవీధుల్లో ఊరేగుతున్నా
నిత్యజీవిత కారాగారంలో
చిత్రహింసకు లోనౌతున్నాయి
మాటలకూ చేతలకూ మధ్య
మాయమర్మాలు ప్రవహిస్తున్నాయి
ప్రజలకూ ప్రభుతకూ మధ్య
పైరవీలు జీవిస్తున్నాయి
భజనయుక్తికి పట్టం కట్టి
సృజనశక్తిని అడవుల్లోకి నెట్టి
"రామ రాజ్యం రాక్షస భోజ్యం" అంటూ
అవి రాగాలు తీస్తున్నాయి -

అరవైయేళ్ల పోరాటం
అర్ధరాత్రి కన్న స్వాతంత్ర్యశిశువును
పాలు పోసి కాదు విషాలు పోసి పెంచారు
సమతావిద్యకు బదులు, స్వార్థవిద్య నేర్పించారు
ధర్మసిద్ధాంతానికి బదులు కర్మసిద్ధాంతం బోధించారు -

అందుకే
వెలుగుజెండాలెత్తిన స్వాతంత్ర్యం
చీకటిపంజరంలో చిక్కుకుంది
భీతిలేని మువ్వన్నెల చిలుక
భ్రాంతివృక్షంమీద బెదురుతూంది
ప్రగతిని పాలించే చక్రం ప్రమాదంలో పడిపోతూంది
రుగ్మతలన్నీ రూపుమాపే వైద్యదేవత
రోగియై మూల్గుతూంది -

అంధకారం - అక్రమార్జన
విలువలన్నిటినీ వెలివేసి
మానవత్వాన్ని లొంగదీస్తున్నది
అవి అంగట్లో కొనేయలేని
హక్కులే లేవంటున్నవి
రాజ్యాంగం ఎలా ఘోషించినా
చట్టాలను ఎలా రూపించినా
స్వాతంత్ర్యం, గణతంత్రం స్వార్థాన్ని జయించలేవట -

సంఘం - సమాజం సాక్ష్యాలెన్ని చూపించినా
"సంభవామి యుగే యుగే" అని
సర్వేశ్వరు డెంత గర్జించినా
దుష్టశిక్షణ శిష్టరక్షణ దుర్లభమైపోతాయో !
జాప్యంగానైనా జరిగితీరుతాయో !

# ఆత్మజ్ఞానం

చెప్పదలచుకున్నదేదో
నీకు తెలిస్తేనే చెప్పు!
ఏ భాషలో చెప్పినా
ఏ భావంతో చెప్పినా
కాస్త అర్థమయ్యేటట్లు చెప్పు!
అర్థంలేని పదబంధాలను
అడ్డు పెట్టుకొని
ఆలోచనలేని ఆవేశాన్ని
అమాయకులమీద కురిపించకు!
గందరగోళాన్ని గాంభీర్యమని
గద్దెలెక్కి గర్జించకు!
దారి వెతుక్కుంటున్న
బహుదూరపు బాటసారులను
పెడదారి పట్టించకు
పరిణామచరిత్ర రచిస్తున్న
కాలానికి
వాస్తవం తెలియని నీ మస్తకాన్ని
ఉపయుక్త పుస్తకంగా అందించకు

చేదబావుల్ని నమ్ముకున్న
శ్రమైకజీవుల్ని
ఎండమావులవైపు నడిపించకు
సంస్కరణలతో సాధించే లక్ష్యాలకు
సంహరణం బోధించకు
జీవితంకోసం పోరాడే జీవులకు
"మరణం శరణం గచ్ఛామి" అనే
కపట మార్గం చూపించకు
నీవు మోహించిన ఇజం నిజం కాలేదని
ఈ ఆశల వసంతానికి
అగ్గిపెట్టకు
కత్తి చేతిలో ఉంది కదా అని
దశకంఠుణ్ణి పట్టుకోలేక
కలకంఠాల స్వరకంఠాలు
నరికేయకు
ఉన్నమాట చెపుతున్నందుకు
నన్నుమాత్రం నిందించకు.

# సత్యమంత్రం

సాటి మనిషికి సాయపడే సంతృప్తి
నా ప్రవృత్తి
అర్థంగాని అవ్యవస్థ నోట
అర్థం చెప్పించే న్యాయవాదం
నా వృత్తి-
ఒంటినిండా కళ్లున్నా
"కాలం" కంటిచూపు కోల్పోయి
దిక్కు తెలియక చిక్కుల్లో పడ్డప్పుడు
ఆరిపోని చూపునిస్తూ
ఆరిపోతున్న దీపాన్ని నేను -

ఆకాశపు నీలిమ నుండి
కురుస్తున్న వెలుగుచీకటి వలయంలో
గిరగిరా తిరుగుతున్న భూగోళానికి
ధైర్యంచెప్పే "దేశం" నేను

ఎన్ని అభిశంసనలనైనా సహించి
నన్ను నేను గుర్తించి,
ప్రశంసించే నగ్న సత్యాన్ని నేను -

విజ్ఞానాన్ని వేటాడే అజ్ఞానానికి
ఆత్మజ్ఞానం ప్రబోధించే
అడవిలోని ఆశ్రమాన్ని నేను
స్వార్థానికి సేవ చేయ టానికై
పరమార్థాన్ని నియంత్రించిన
రాక్షస గణతంత్రాన్ని ఛేదిస్తున్న
సత్యానామ మంత్రాన్ని నేను

## విప్లవ కోకిల

దిగులు పడకు నేస్తం
దిగులు పడకు
కాల వృక్షం మీద
సరిక్రొత్త కాంతి చివురిస్తున్నది
విలయ శిశిర గర్భంలోనుంచే
విప్లవ వాసంతం ప్రభవిస్తున్నది
వసంతం అడవుల్లోనే దొరుకుతుందని
వెధకి వెదకి వేసారిన
ఆశల పికాలు
ఆవేశాల శుకాలు
అపోహలకు చోటులేని
ఆలోచనలో పడ్డాయి
మురికి వాడల్లోనే
బ్రతుకు పీడల్లోనే
బావురుమన్న ఇళ్లలోనే
భీతిల్లిన కళ్లల్లోనే
ఆమని ఆవిష్కృతమౌతున్నట్లు
కనుగొన్నాయి -

సెలయేళ్లై పారిన కష్టాల కన్నీళ్లు
పంటకాలువలై
బీటు భూములకు జీవం పోస్తున్నాయి
పల్లె సీమలకు
పూల పరుపులు వేస్తున్నాయి -

క్రొత్త వసంతాన్ని దర్శిస్తున్న
కోకిలలు
మాటల్లో చెప్పలేని మార్పులను
పాటలతో పలికిస్తున్నవి
తాము స్వప్నాలు కన్న సత్యాన్ని
గుర్తు చేసుకుంటూ
పరవశించి పాడుతున్నాయి పదేపదే
వనంలో అల్లుకున్న పాటల్ని
జనంలో పాడేస్తున్నాయి
చెట్ల కొమ్మల మాటున
గుట్టుగా మూల్గిన పిట్టలు
చట్టాల కోట కొమ్ము మీద
శాంతి శంఖం పూరిస్తున్నవి
స్వేచ్ఛగా విహరిస్తున్నవి

# ఉపజ్ఞా కోకిల

చెట్ల నవ్వులు పువ్వులై
కొమ్మల ఊహలు పాటలై
వనమెల్లా రంగు రంగుల వసంతమై
ప్రకృతి పరవశించేలా
చేసుకుంటున్న పండుగ ఇది -

మితి లేని కాలానికి
ఒక పరిమితి నిర్దేశించి
నిర్వహించిన కార్యకలాపాలను
నిలదీసి అడిగే సమీక్షాధికారి
ఈ సంవత్సరాది పండుగ -

సరిక్రొత్త బాధ్యతల పంచాంగం అప్పగించి
చేదు - తీపి, జయాపజయాలు
కష్టసుఖాలు - వెలుగు చీకట్లు వంటి
విరుద్ధ యధార్థాలను ఎదురుకునే
వింత వింత పరీక్షలు పెట్టి
ముచ్చటగా పచ్చడి త్రాగి వెళ్లిపోయే
ఉన్నతాధికారి ఈ ఉగాది-

అన్ని పండగల్లాగ ఆయా దేవుళ్లకు
దండాలు పెట్టి దాసోహం అనదు
స్థితప్రజ్ఞను ఆత్మజ్ఞానాన్ని గౌరవించే
ఉపజ్ఞా కోకిల
ఈ చైత్రరథ జైత్రయాత్రా వినోదిని

# అవర్ణనీయం

ఇన్ని అభివర్ణించిన వాచస్పతిని నేను
నిన్ను వర్ణించలేకపోతున్నాను
ఎన్నెన్నో అనుభవించిన కళామతిని నేను
నిన్ను అభినయించలేక పోతున్నాను-
నీ చరణాలు దర్శించిన నేను
నీశిఖరాలు స్పర్శించలేకపోతున్నాను
నా ప్రణవ ప్రణయినీ!
నిన్ను చేరుకొనే యోగం నేర్చుకుంటున్నాను
లెక్కలేని చుక్కలు రచించిన
నీలి నిశాకాశాన్ని వ్యంజించే
శబ్ద శిల్పం తెలిసిన నేను
ఎక్కడినుండి ఎక్కడికి ప్రసరిస్తున్నాయో
ఎరుగరాని నీ వీక్షణ తారాతరంగాలను
విశ్లేషించే నిశ్శబ్ద శిల్ప రహస్యాలు నేర్చుకుంటున్నాను
శ్రీకార శిఖరాలమీద
ఓంకార ప్రాకారాల మీద
నా ఆత్మానుభూతి కేతనాలు ఎగరవేయటానికి
నీ సరళవక్రరేఖా గణిత గుణిత జనిత
అగణిత రూపాలను
అవగాహన చేసుకుంటున్నాను
నిన్ను ఎన్ని పేర్లతో పిలిచినా, ఎన్నితీర్లుగా వలచినా
నా చేతికి చిక్కని నీ చేతనానికి
శరణం అంటున్నాను

# కాల పత్రలిపి

కాలం
తన క్యాలెండర్‌లో
నా మహాప్రస్థానం కోసం పెట్టిన
ముహూర్తపు గుర్తు
మసక మసకగా కనిపిస్తూంది
మత్తు వీడుతున్న నా కళ్లకు -

నా బ్రతుకు డైరీలో
నేను కోరికోరి వ్రాసుకున్న
భిన్న భిన్న కార్యకలాపాలు
ఆశలు, ఆశయాలు, ఆలోచనలు
అన్నీ ఏకకేంద్రాభిముఖమగుతున్న
అక్షర క్షణం అది -

ఎన్ని భాషలు నేర్చినా
ఎన్ని పరిభాషలు నేర్చినా
ఇన్నాళ్లు నాకు బోధపడని
కాలపత్రలిపి
ఇప్పుడు హఠాత్తుగా
అవగతమవుతున్నది నాకు

అర్థంలేనిది అర్థం కానిది
అర్థమైపోతున్న
అంతిమక్షణం - అంతులేని క్షణం అది -

ఆ కాలబ్రహ్మ
లిపిలేని భాషలో భాషలేని లిపిలో
వ్రాసిన నిర్దేశాలు
రహస్య సంకేతాలు
ఆవిష్కరిస్తున్న సత్యానుభూతి
నన్నాహ్వానిస్తున్నవి
అమృతీకరిస్తున్నది -

# స్త్రీ వేదం

స్త్రీలు - పురుషులు
పుట్టేది తల్లి కడుపులోనే
ఆడ - మగ జీవించేది ఒకే ఇంటిలోనే
ఒకరు లేక ఒకరు లేని
అద్వైతులు స్త్రీ పురుషులు
సృష్టి పత్రానికి రెండు పుటలు
స్త్రీ - పురుష శక్తులు
జీవన ప్రవంతికి రెండు దరులు స్త్రీ పుంస చేతనాలు
స్త్రీ అంటే చెల్లీచెల్లని చెక్కు కాదు
సృష్టి రహస్యం తనగర్భంలో
శుక్తిగా మలచుకున్న హక్కు
స్త్రీ అంటే,
తల్లి, చెల్లి, కూతురు, కోడలు
ప్రేయసి, భార్య - అత్త, ఆడపడచు
ఏ పాత్రలో జీవించినా సరే
స్త్రీ, పవిత్రమూర్తి - అజేయగాత్రి
స్త్రీ శక్తిని ఎదిరించలేని పురుషాహంకారం
బెదిరించి బ్రతుకుతూంది
లైంగిక సమానత్వాన్ని
అంగీకరించలేని అజ్ఞానం
ఆడది అబల అనుకొని
ఆత్మవంచన చేసుకుంటున్నది

పారలౌకిక ప్రమద శక్తిని
పాశవిక ప్రమాణాలతో కొలిచి
ప్రమాదంలో పడుతున్నది -

వంటింటి కుందేలుగా
విలాస వస్తువుగా
సంతానోత్పత్తి యంత్రంగా
శీలం దోచబడితే శిలయై పోవలసిన పతివ్రతగా
కులమతాల దురాచారాల ముందు
తలవంచ వలసిన బలిపశువుగా
ఎవరు ఎందుకు స్త్రీని పరిగణిస్తున్నారో
తెలిసికోలేని 'మేధావులు'
ఎలుకలు దూరాయని ఇంటిని తగలేసే జడభరతులు
స్త్రీవాదం పేరుతో చెలిని చిత్రహింస చేస్తున్నారు
వెనుక నుయ్యి, ముందు గొయ్యి చూపి
వెర్రితలలు వేస్తున్నారు -

నేడు కావలసింది
అంగనను అబలగా చిత్రించే స్త్రీవాదం కాదు
సబలగా గుర్తించే స్త్రీవేదం
స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేవని
విలపించేది స్త్రీవాదం
ఉన్నా ఉపయోగించుకోనీయని
పన్నాగాలను ప్రశ్నించేది స్త్రీవేదం

ఉన్నది లేనట్లుగా లేనిది ఉన్నట్లు ఊహించి
మగువను వంచించే
'మగధర్మ' సూత్రాలను
సతిపతిత్వ సామరస్య తత్వాన్ని
వక్రీకరించే మనుధర్మ సూత్రాలను
సంస్కరించే సద్బుద్ధి, త్రికరణ శుద్ధి
స్త్రీ వేదం -
భయం - స్త్రీవాదం
అభయం - స్త్రీ వేదం

స్త్రీ - పురుష శక్తి ప్రయోక్త
పురుషుడు - స్త్రీ శక్తి ప్రవక్త
అజ్ఞానం - అహంకారం కలిసి
తొడిగిన
లైంగిక అసమానత్వం
ప్రకృతి రూపిణి పడతిని వికృతం చేసింది
పావన స్త్రీ పుంసానుబంధానికి
పాపపంకిలం పూసింది
అమూల్యమైన మాతృమూలాన్ని
అల్లరిపాలు చేసింది
తన నీడను తానే శంకించే తర్కానికి లోబడి
త్యాగరాగ జీవన జ్యోతిని
చీకటి చెరలో పడవేసింది
పరమ స్వతంత్ర వనాంతర కోకిలను
పరాధీనను చేసింది -

లైంగిక వివక్ష వ్యూహంలో చిక్కిన
సాంఘిక వ్యవస్థ విముక్తి
స్త్రీ వేదం
మానిని వ్యక్తిత్వాన్ని కొలిచే
మానవత్వం స్త్రీ వేదం
అంగట్లో హక్కులు పెట్టి
అంగన స్వేచ్ఛకు శని పెట్టే
దొంగ విలువలు మారాలి
యదార్థం తెలిసి కూడా ఎరుగనట్లు
నటించే రాజకీయం వీగిపోవాలి
సాధ్వి శక్తివేదులు, సత్యావిష్కరణ యోధులు
నిస్తుల, నిర్భయ నిర్మల నీతిని నిలబెట్టాలి!

పొగబెట్టి పోవద్దన్నట్లు
గడియవేసి లోనికి రమ్మన్నట్లు
లైంగికంగా అబలను చేసి
సాంఘికంగా సమానం అంటే
సాధించేది నిండుసున్న
స్త్రీ సౌందర్యాన్ని శీలాన్ని
సిగ్గు చేటుగా చిత్రించవద్దు
అని
కాపురుషుల చేతిలో నలిగిపోయే
కాగితపు బొమ్మలని బోధించవద్దు
శీలం - పాతివ్రత్యం

చీడపురుగులు చెరిపివేయగల రంగులు కావు
కామాంధులు దొంగిలించే సొమ్ములు కావు
మానినీ మణి దేహాత్మలు
మదోన్మత్తులు కొల్లగొట్టలేని
వజ్రబల దుర్గాలు
పరమ పురుషానుభూతి స్వర్గాలు -

శీలంమీద దాడి జరిగితే
సిగ్గుతో క్రుంగిపోవద్దు
గీతామృత పునీత గాండీవంలా
ధర్మరక్షా దీక్షోద్దండ కోదండంలా
గర్జించు!
ప్రకృతి సిద్ధ, న్యాయబద్ధ
ఆత్మాభీష్ట శరాలు సంధించు!
నారి అంటే
విజయధనువు
నారియని నిరూపించు!
టక్కరి వలలో చిక్కిన స్త్రీ!
లైంగిక పరాభవాన్ని
అంగీకరించనప్పుడే
లెక్కలేని నీ హక్కులన్నిటికీ
రెక్కలు మొలుస్తాయి
గడప దాటడానికి గజగజలాడే స్త్రీత్వం
గగన సీమల్లో విహరిస్తుంది

నీ నిజరూపాన్ని నిర్వచించే నిరూపించే
'స్త్రీ వేదం' జయిస్తుంది

మానభంగం - శీలభంగం
వ్యభిచారం - అపచారం వంటి
మలినార్థక మాయాపదజాలంతో
మగువ నోరు కట్టేస్తున్న
స్త్రీస్వేచ్ఛను అణచిపెట్టేస్తున్న
నేతి బీరకాయ నీతులు మారాలి
విదుషికి లైంగిక కళంకం ఆపాదించే
వితండ విషవాదాలు తొలిగిపోవాలి
స్త్రీ పట్ల పురుషుని దుష్ప్రవర్తనకు
శిక్ష అపరాధికి, రక్ష బాధితురాలికి
కలిపించే చట్టానికి పట్టం కట్టాలి
శిక్షలన్నిటికి మించిన శిక్ష
"లైంగిక వివక్ష"
అది సుగుణాలన్నిటినీ
న్యూనతాంకంతో గుణించి
శూన్యం చేస్తుంది
ప్రతిభలన్నిటినీ కుత్సిత విలువలతో భాగించి
దైన్యం మిగిలిస్తుంది
'నాతిచరామి' ప్రమాణాలు నాతికే వర్తింపజేస్తుంది -

పరిమిత సంతానం
ప్రతీ వనిత ప్రాథమిక హక్కు కావాలి
అపరిమిత వివక్షా రహిత స్వేచ్ఛ
స్త్రీ జన్మహక్కు కావాలి!
పురుషాలంబనం కన్న
ఆర్థిక స్వావలంబనం
మహిళ జీవితమార్గం కావాలి
పడతి ప్రగతిపాటకు పల్లవి కావాలి -

కొమ్మలను విరబూయించేది
కోకిలత్వం
శిశిరాలను ఉసికొల్పేది
కాకితత్వం

శిలలను శిల్పం చేసేది
కమ్మని కలలు కనే ఉలి
శిల్పాలను శిథిలం చేసేది
విద్వేష ధ్వజమెత్తే పిడికిలి
స్త్రీ స్వేచ్ఛను పోషించేది
పరస్పర విశ్వాస విహాయసం
వనిత వ్యక్తిత్వాన్ని హరించేది
అనుమానాల, అవమానాల వికటహాసం
స్త్రీ - శాంతి కపోతం - స్వేచ్ఛా జలపాతం
స్త్రీ - సహజానందమయూరి, బ్రహ్మానంద కుమారి

గౌరవిస్తే గౌరి
నిందిస్తే నిర్జీవ ఝరి
అభిమానిస్తే కామధేనువు - సృజన గాన వేణువు
అభిశంసిస్తే, గడ్డకట్టిన స్థాణువు
చితికిపోయిన బ్రతుకు రేణువు
అందుకే
నేడు కాలం కావాలంటున్నది
స్త్రీ - పురుషుల మధ్య
అపోహల హాలాహల కోలాహలం కాదు
ప్రేమానురాగాలు పెంపొందించే
సహజీవన వసంతాలు
సమతాభావ లతాంతాలు
మసిబూసి చేస్తున్న
మారేడు కాయలు కాదు
కరి మ్రింగిన వెలగపండ్లు కాదు
మతిపోయిన పురుషాహంకారాలకు
శ్రుతి తప్పిన వ్యాపార వాదాలకు
చరమ గీతం పాడే
స్వచ్ఛంద స్వేచ్ఛానాదం
వేదవేదాంగాలు కూడా ప్రశంసించి
పరవశించే
సత్య విజయ "స్త్రీ వేదం"